

# The Sun Camera...
# For Fun Pictures







*"Right in here... is a piece*



*of the sun! At lightning speed...*



*a light load of fun ! Shoot with it...*



*catch 'em on the run! with Candida...*



*the great little one!"*

new

Daylight

**Candida**™

POCKET CAMERA

JAPANESE TECHNOLOGY

PRICE Rs.195 ONLY

AVAILABLE AT ALL LEADING STORES

Black

పౌచ్ ప్యాక్ కొనండి...

రూ... 2-75 ఆదా చేయండి!







20 ML.
సీసాదర
రూ. 8.50




20 ML
పౌచ్ దర
రూ. 5.75

మార్కెట్‌లో రెండు రకాల ప్యాకెట్లలో లభించును

మీ కేశ సంపదకు

# రీటా

# Don't you owe the















Tonight
Tomor




# చందమామ

సంస్థాపకుడు: 'చక్రపాణి'　　　　సంచాలకుడు: నాగిరెడ్డి

## చిరునవ్వుకు చిట్కా!

ఇటీవల ఢిల్లీనగర పాఠశాలవిద్యార్థులు కొందరు భారతరాష్ట్రపతి శ్రీ వెంకటరామన్‌ను కలుసుకున్నప్పుడు, "ఎప్పుడూ మీరు నవ్వుతూ కనిపిస్తారు. అదెలా సాధ్యమవుతుంది?" అని అడిగారు. అందుకు మన రాష్ట్రపతి, "కష్టపడి పనిచేయండి, నిజాయితీగానూ, నిష్కపటంగానూ నడుచుకోండి. దేశాన్ని ప్రేమించండి. మీ మీ కర్తవ్యాలను నిర్వహించండి. అప్పుడు మీరూ ఎప్పుడూ హాయిగా నవ్వుతూ ఉండవచ్చు," అన్నారు చిన్నగా నవ్వుతూ.

ఆయన సలహా పిల్లలేకాదు, పెద్దలందరూ కూడా అనుసరించ తగినది; ఆచరించవలసినది. మనం కష్టపడి పని చేయడంమీదే మన ప్రగతి, దేశాభివృద్ధి ఆధారపడి ఉన్నాయి. రెండవ ప్రపంచ యుద్ధ సమయంలో సర్వనాశనమైపోయిన జర్మని, జపాను దేశాలు ఈనాడు మళ్ళీ సుసంపన్న దేశాలుగా అభివృద్ధి చెందడానికి కారణం, అక్కడి ప్రజలు కష్టపడి పని చేయడమే!

ఇక నిజాయితీ, నిష్కాపట్యం అనే ఉన్నత ఆదర్శాలు మనుషుల మధ్య సన్నిహిత సత్సంబంధాలు పెంపొందడానికి దోహదం చేస్తాయి. ఆ తరవాత, మాతృదేశభక్తి. దేశమంటే కేవలం మట్టికాదు, మనుషులు; దేశభక్తి అంటే దేశంలోని సాటి ప్రజలను మనలాగే భావించి, ప్రేమించడం, గౌరవించడం. దేశప్రజలందరూ పరస్పర ఆదర భావంతో, ఐకమత్యంతో నడుచుకున్నట్టయితే, ఆ దేశాన్ని ఇతర దేశాలు కూడా గౌరవిస్తాయి!

ఇక ఈ గుణాలన్నిటికీ ఆధారభూతమైన కర్తవ్య నిర్వహణ. కర్తవ్య నిర్వహణ అన్నది మన పవిత్ర గ్రంథాలు ప్రబోధించే ఆధార నైతిక సూత్రం. అవి ఒక్కడుగు ముందుకు వెళ్ళి—ఫలితం గురించి దిగులుపడకుండా నీ కర్తవ్యాన్ని సక్రమంగా నిర్వహించు. ఫలితం దానంతట అదే వస్తుంది, అని బోధిస్తున్నాయి. ఇటువంటి సదవగాహన ఏర్పడినట్టయితే, మన కర్తవ్యాలను సక్రమంగానూ, సులభంగానూ, నిర్వర్తించగలం. మనమూ ఎప్పుడూ నవ్వుతూ మనచుట్టూ వున్న పదిమందినీ హాయిగా నవ్వించగలం!

సంపుటి 90　　　　ఫిబ్రవరి '92　　　　సంచిక 2

విడి ప్రతి: 4-00　　　　: :　　　　సంవత్సర చందా: 48-00

CHITRA

# ఐక్యరాజ్య సమితి నూతన ప్రధాన కార్యదర్శి



ఈజిప్టు మాజీ ఉపప్రధాని శ్రీ బౌట్రోస్ ఘాలీ నూతన సంవత్సరాది రోజున ఐక్యరాజ్యసఖితి ప్రధాన కార్యదర్శి పదవిని చేపట్టారు. ప్రపంచ రాజకీయాలలో కీలకమైన పాత్ర వహించే ఈ ఉన్నతపదవిని చేపట్టిన ఘాలీ వయసు అరవైతొమ్మిది సంవత్సరాలు.

ఈజిప్టు విదేశ వ్యవహారాల మంత్రిగా వున్నప్పుడు శ్రీ ఘాలీ తీసుకున్న కొన్ని చర్యల ద్వారా ప్రపంచ దృష్టిని ఆకర్షించారు. 1979 వ సం॥లో ఈజిప్టు—ఇజ్రాయెల్ ఒడంబడిక ఏర్పడడానికి ఆయన ఎంతో కృషిచేశారు. 'క్యాంప్ డేవిడ్ ఒడంబడిక' అని పిలువబడే ఆ ఒప్పందం ద్వారా ఉభయదేశాల మధ్య దశాబ్దాలపాటు కొనసాగుతూ వచ్చిన ఘర్షణ అంతమయింది. ఇటీవల అంటే 1990 వ సం॥లో ఇరాక్, కువైట్ మీద దురాక్రమణ జరిపినప్పుడు—ఆ దుండగాన్ని అరబ్ దేశాలన్నీ ఏకకంఠంతో ఖండించడానికి, ఘాలీ కీలకమైన పాత్ర వహించారు. ఈ రెండు చర్యల ద్వారా ఘాలీకి అంతర్జాతీయ స్థాయిలో మంచి గుర్తింపు, గౌరవం లభించాయి.

ఘాలీని, ఐక్యరాజ్యసమితి ప్రధాన దర్శిగా ఏకగ్రీవంగా ఎంపిక చేశారు. ఈనాడు ప్రపంచంలో అక్కడక్కడ ఉద్రిక్తవాతావరణం నెలకొని ఉన్నది. ముఖ్యంగా కంపూచియాలోనూ. యుగొస్లేవియాలోనూ శాంతిని పరి

బొ|్రటోస్ ఘాలీ ఐక్యరాజ్య సమితి ఆరవ ప్రధాన కార్యదర్శి. ఆయనకు పూర్వం నార్వేకు చెందిన ట్రిగ్వేలీ (1946–52); స్వీడన్‌కు చెందిన దాగ్ హేమర్స్క్‌జోల్డ్, (1953–61) బర్మాకు చెందిన యుథాంట్ (1961–71) ఆస్ట్రియాకు చెందిన డా॥ కుర్ట్ వాల్‌ధీమ్ (1972–1981) పెరూకు చెందిన పెరెజ్ డి. క్యూలర్,'82-91 ప్రధాన కార్యదర్శి పదవీబాధ్యతలు నిర్వహించారు.

రక్షించే బాధ్యత ఐక్యరాజ్య సమితికి ఉన్నది. కంపూచియాలో శత్రువర్గాలు ఇరవైయేళ్లు సాగించిన ఘర్షణలనువదిలి పెట్టి 'సుప్రీమ్ నేషనల్ కౌన్సిల్'ను తాత్కాలికంగా ఏర్పరచాయి. దాని ద్వారా ఎన్నికలు జరిపి నిజమైన ప్రజా స్వామ్య ప్రభుత్వాన్ని నెలకొల్పడానికి కృషి జరుగుతున్నది.

యుగొస్లేవియాలో స్లోవేనియా, క్రోషియా వంటి రిపబ్లిక్‌లు ఫెడరేషన్ నుంచి స్వతంత్ర దేశాలుగా విడిపోవడం వల్ల అక్కడ యుద్ధవాతావరణం నెల కొని ఉన్నది. ఆ ప్రాంతంలో శాంతి భద్రతలు ఏర్పడడానికి అమెరికా, రష్యా, మరికొన్ని యూరపుదేశాలు కృషి చేస్తున్నాయి. ఈ రెండు ప్రాంతాలకు, ఐక్యరాజ్య సమితి శాంతి రక్షక దళాలు అప్పుడే చేరాయి.

ప్రాంతీయ ఘర్షణలను తొలగించి, శాంతిని పరిరక్షించడం ఐక్యరాజ్యసమితి ప్రధాన లక్ష్యాలలో ఒకటి. ఈనాటి ప్రధాన కార్యదర్శి మరొక ముఖ్యమైన బాధ్యతను కూడా నిర్వర్తించవలసి ఉన్నది. ఐక్యరాజ్యసమితి సంస్థాగత వ్యవహారాలలో, ఆదేశిక సూత్రాలలో సిద్ధాంతాలలో కొన్ని సంస్కరణలు తీసుకురావాలన్న కోరిక చాలా కాలంగా వినిపిస్తున్నది. భద్రతా సమితిలో జర్మనీ, జపాన్ దేశాలకు శాశ్వత సభ్యత్వం కల్పించి భద్రతాసమితిని విస్తృత పరచాలన్నది ఒక కోరిక. ఇటీవల భారత దేశంలోని అమెరికా రాయబారి, పాట్రిక్ మోనీహాన్, భద్రతా సమితిలో భారత దేశానికి కూడా శాశ్వత సభ్యత్వం కల్పించాలన్న అభిప్రాయం వ్యక్తం చేశారు.

తనను ఐక్యరాజ్య సమితి ప్రధాన కార్యదర్శిగా ఎంపిక చేశారని తెలియగానే శ్రీ ఘాలీ, "ఇది నాకూ, నా దేశానికీ గొప్ప గౌరవంగా భావిస్తున్నాను. ఎన్నో మార్పులు వస్తూన్న ఈనాటి ప్రపంచంలో ఐక్యరాజ్యసమితి మహత్తరమైన పాత్రను నిర్వహించవలసి ఉన్నది. నా కర్తవ్య నిర్వహణకు నేను నా శాయశక్తులా కృషి చేస్తాను," అని అన్నారు.

1945వ సం॥లో ఐక్యరాజ్య సమితిని స్థాపించినప్పుడు 51 దేశాలకు అందులో సభ్యత్వం ఉండేది. ఇవాళ సభ్యదేశాల సంఖ్య 166 వరకు పెరిగింది. గత సెప్టెంబర్‌లో, ఇటీవల స్వతంత్రదేశాలయిన బాల్టిక్ రిపబ్లిక్‌లకూ, ఉత్తరదక్షిణ కొరియాలకూ, పసిఫిక్ ద్వీప దేశాలయిన మైక్రొనేషియా, మార్షల్ దీవులకూ సభ్యత్వం లభించింది.



# అరవైకాసుల వడ్డాణం

పద్మనాభపురం ప్రభుత్వ కచేరీలో, ప్రకాశం అనే అతడు చిన్న ఉద్యోగి. అతడు ఒకనాడు కచేరీ పని మీద పొరుగూరు వెళుతూ, భార్య జానకికి చెప్పవలసిన జాగ్రత్తలన్నీ చెప్పి బయలుదేరాడు. ఆమె ఆ సాయంత్రం ఇంటిపనులన్నీ ముగించుకుని, ముందు గదిలోకి వచ్చేసరికి చీకటి పడబోతున్నది.

ఆసమయంలో ఒక డెబ్బైఏళ్ల వృద్ధుడు, వీధివైపునుంచి ఇంటికేసి వస్తున్నాడు. ఆయన చేతిలో ఒక పెట్టె వున్నది. బాడుగ బండి వాడొకడు పెద్దగా, "బండి పట్నం దాకా మాట్లాడుకుని, ఇక్కడే దిగిపోతే ఎలా?" అని గట్టిగా అరుస్తున్నాడు.

ముసలాయన వెనక్కు తలతిప్పి, "నీకు పూర్తిగా బాడుగ ముట్టజెప్పాక, నేను ఎక్కడ దిగిపోతే ఏం? ఈ రాత్రికి ఇక్కడ తమ్ముడి ఇంట్లో విశ్రాంతి తీసుకుంటాను," అని నిదానంగా ఇంటి ముందున్న మెట్లు ఎక్కాడు.

ఆయనను జానకి ఏనాడూ చూసి వుండలేదు. ఆమె ఆశ్చర్యంగా ఆయనకేసి చూస్తూ, "ఎవరండీ మీరు? ఇది ఎవరిల్లని అనుకుంటున్నారు?" అని అడిగింది.

"చెబుతాను, ముందు ఇన్ని మంచి నీళ్ళు తెచ్చిపెట్టు, తల్లీ!" అన్నాడు ముసలాయన దాపులవున్న పడక కుర్చీలో కూర్చుంటూ.

జానకి ఒక కంచుచెంబు నిండుగా నీళ్ళు తెచ్చి ఇచ్చింది. ముసలాయన నీళ్ళు తాగి, "ఇది ఎవరిల్లో నాకు తెలియదు. ఈ రాత్రికి ఆశ్రయం యిస్తే, తెల్లవారి మా ఊరు వెళ్ళిపోతాను," అన్నాడు.

ఇది విని జానకి ముసలాయన్ని పరీక్షగా చూసింది. ఆయన ప్రమాదకరమైనే మనిషిలా కనిపించలేదు. ఆమె కాస్త

మాచిరాజు కామేశ్వరరావు



అంతా ఆశ్చర్యంగా చూస్తున్న జానకితో, ముసలాయన ఇలా చెప్పాడు:

ఆయన పేరు నీలకంఠం, పెద్ద భూస్వామి. ఆయన ముగ్గురు కొడుకులకూ పెళ్ళిళ్ళు అయ్యాయి. వాళ్ళకు వ్యవసాయం అంటే రోత, వ్యాపారం అంటే మోజు. వాళ్ళ పంతం పట్టడంతో నీలకంఠం తనకున్న అరవై ఎకరాల పొలం అమ్మేశాడు, ఆ డబ్బుతో కొడుకులు పట్నంలో వ్యాపారం మొదలుపెట్టారు. నీలకంఠం మాత్రం పల్లెలో సొంత ఇంట భార్యతో ప్రశాంతంగా వుంటున్నాడు. ఆర్నెల్ల క్రితం హఠాత్తుగా ఆమె పోయింది. కొడుకులు నీలకంఠాన్ని పట్నం తీసుకుపోయారు. పల్లెలో వున్న ఇంటిని అమ్మేశారు. ఆఖరుసారిగా ఆయన పల్లెకుపోయి భార్య నగలతో తిరిగొస్తున్నాడు. అయితే, బండివాడి ప్రవర్తన ఆయనకు అనుమానం కలిగించింది. సాయంత్రానికల్లా పట్నం చేరవలసిన బండి నత్తనడకలు నడుస్తూ, చీకటిపడే వేళకు, ఈ ఊరు చేరింది. అంత బంగారంతో చీకటివేళ ప్రయాణం చేయడం ఇష్టం లేక, బంధువున్నాడన్న నెపంతో బండిదిగిపోయాడు, నీలకంఠం.

''మంచిపనిచేశారు. కాళ్ళుకడుక్కొని వస్తే వడ్డన చేస్తాను,'' అంటూ వంట గదిలోకి వెళ్ళింది, జానకి.

తటపటాయిస్తూ, ''ఆశ్రయం ఇవ్వడానికి అభ్యంతరంలేదు, బాబుగారూ! చూడబోతే మీరేదో కంగారులో వున్నట్టున్నారు,'' అన్నది.

''అవునమ్మా! నా కంగారుకూ, భయానికీ కారణం, ఇది!'' అంటూ ముసలాయన పక్కన పెట్టుకున్న పెట్టె మూత తీసి చూపించాడు.

పెట్టెనిండా బంగారు నగలు; వాటిలో పెద్ద వడ్డాణం కూడా ఒకటున్నది. ముసలాయన వడ్డాణాన్ని బయటికి తీసి, జానకితో, ''దీనిబరువెంతో తెలుసామ్మా? అరవైకాసులు!'' అంటూ దాన్ని పెట్టెలో పెట్టేశాడు.



భోజనాలయ్యాక, మాటల సందర్భంలో నీలకంఠం, "తెల్లవారి పట్నం చేరగానే, నాకొక సమస్య ఎదురుకాబోతున్నది, జానకీ!" అన్నాడు.

"ఏమిటి బాబాయి అది?" అని కుతూహలంగా అడిగింది, జానకి.

"నా దగ్గిర మొత్తం వంద కాసుల బంగారం వున్నది. అందులో ఈ వడ్డాణమే అరవైకాసులది. దీన్ని నేను నా భార్యకు మొదటి పెళ్ళిరోజు కానుకగా ఇచ్చాను. దానిని చెరిపించడం, నాకిష్టంలేదు. ఒక కోడలికి అరవైకాసుల బంగారం, మిగతా ఇద్దరికీ చెరొక ఇరవైకాసుల బంగారం ఇవ్వాల్సి వస్తుంది! ఇదీ సమస్య!" అన్నాడు నీలకంఠం.

"మిగతా ఇద్దరికీ, తేడా నలభైకాసుల బంగారానికి సరిపడ్డ రొఖం ఇచ్చేయండి, సరిపోతుంది," అన్నది జానకి.

నీలకంఠం పెద్దగా నవ్వి, "పొలం డబ్బూ, ఇంటి డబ్బూ నా కొడుకులకు, ఏనాడో సమంగా పంచి ఇచ్చాను. ఇప్పుడు నాదగ్గిర మిగిలింది, ఈ బంగారమే. ఇదీ పంచేసి, హాయిగా కొడుకుల దగ్గిర, ఏ చీకూ చింతా లేకుండా శేషజీవితం గడిపేస్తాను," అన్నాడు.

జానకి కాసేపు ఆలోచించి, "అయితే, ఆ వడ్డాణం మిమ్మల్ని ఎక్కువ ప్రేమగా చూసే కోడలికి ఇవ్వండి." అన్నది, చిన్నగా నవ్వుతూ.

"నా ముగ్గురు కోడళ్ళూ, నన్నెంతో గౌరవంగా, ప్రేమగా చూస్తారు. అందు వల్లనే, వడ్డాణం వారిలో ఎవరికివ్వాలో తేల్చుకోలేకపోతున్నాను," అన్నాడు నీలకంఠం.

"మీ దగ్గిరున్న నూరు కాసుల బంగారంలో, అరవైకాసుల వడ్డాణం ఎవరికో ఒకరికి వస్తుందనీ, దాన్ని చెరిపించడం మీకిష్టం లేదనీ, మీ కోడళ్ళకు తెలుసా?" అని అడిగింది, జానకి.

"తెలుసు. నేను బంగారం తీసుకు రావడానికే, ఊరికి ప్రయాణం అయ్యానని



కూడా వాళ్ళేరుగుదురు,'' అన్నాడు నీలకంఠం.

జానకి చాలాసేపు ఆలోచించి, ''మీ కోడళ్ళలో, మీ మీద ఎవరికి ఎక్కువ ప్రేమ వున్నదో చిన్న నాటకం ద్వారా బయటపెడతాను. అయితే, నేను చెప్పినట్టు చేయాలి మీరు!'' అన్నది.

''ఈ సమస్య తీరిపోతే, నాకు నిశ్చింత. నువ్వు చెప్పినట్టే చేస్తాను,'' అన్నాడు నీలకంఠం.

తెల్లవారగానే ఏవో పత్రాలు సిద్ధం చేసి, నీలకంఠం సంతకాలు తీసుకున్నది, జానకి. తర్వాత ఆమె తమ ఊరి మనిషి ద్వారా, నీలకంఠం కోడళ్ళకు, ''మీ మామగారు, మిమ్మల్ని మాత్రమే వెంటనే బయలుదేరి రమ్మన్నారు,'' అని కబురు పంపింది.

మధ్యాహ్న సమయానికి, నీలకంఠం కోడళ్ళు ముగ్గురూ ఇంటిముందు బండి దిగారు. వాళ్ళను చూస్తూనే జానకి, నీలకంఠాన్ని లోపలి గదిలోకి తీసుకుపోయి, మంచం మీద పడుకోబెట్టి, ముఖం మీద దుప్పటి కప్పుతూ, ''ఇక మీరు లేరు!'' అన్నది.

''అదేం మాట!'' అన్నాడు నీలకంఠం ఉలిక్కిపడి.

''మీరు కాస్సేపు చచ్చిపోయినట్టు కళ్ళు మూసుకు పడుకోండి. మీ కోడళ్ళ ప్రేమకు, ఇది పరీక్షాసమయం!'' అన్నది జానకి.

తర్వాత ఆమె అంతకు ముందు రాసి వుంచిన పత్రాలు తీసుకుని, ముందు గదిలోకి వెళ్ళింది.

ఆమెను చూస్తూనే, నీలకంఠం కోడళ్ళు, ''మీరెవరు? నిన్ననే ఇంటికి రావలసిన, మా మామగారు ఇక్కడ ఆగిపోయారెందుకు?'' అంటూ లోపలికి వచ్చారు.

జానకి, ఆ ముగ్గురి ముఖాల కేసి ఒకసారి పరీక్షగా చూసి, ''మా ఆయన ప్రభుత్వకచేరీలో న్యాయవాది. నీలకంఠం

గారు, ఆయనతో సంప్రతించి, తన వద్ద వున్న బంగారాన్ని నగరంలోని వృద్ధుల ఆశ్రమానికి విరాళంగా ఇచ్చారు. ఆ పని మీదే, మీ మామగారు ఇక్కడికి వచ్చారు," అన్నది పత్రాలను వాళ్ళకు చూపుతూ.

కోడళ్ళు ముగ్గురూ వెలవెలపోతూ, "అసలాయన ఏరి? ఎందుకు మాకిలా అన్యాయం చేశారు?" అన్నారు.

"ఆయన లోపల గదిలో వున్నారు. అయితే, మీ ప్రశ్నకి జవాబు చెప్పలేరు. ఈ తెల్లవారుజామున హఠాత్తుగా కన్ను మూశారు!" అన్నది జానకి ఏమాత్రం తొణకకుండా.



"అలాగా!" అంటూ నీలకంఠం పెద్ద కోడలు మెటికలు విరిచి, "ముసలి వెధవకు మూడు పూటలా వేడివేడిగా వండి వడ్డించాను. పస్తులుంచి చంపినా పీడాపోయేది!" అన్నది.

"నిద్ర కూడా మానుకుని, వైద్యుడు చెప్పిన మందులు శ్రద్ధగా ఇచ్చాను. ఆ చేత్తోనే గుక్కెడు విషం గొంతులో పోసి వుంటే, ఈ అఘాయిత్యపు పని చేయకుండా హరీ అనేవాడు!" అన్నది రెండో కోడలు పళ్ళుకొరుకుతూ.

"కంఠం నొప్పి పుట్టేదాకా గట్టిగా పురాణాలు చదివి వినిపించేదాన్ని. చేతులు చచ్చుపడేలా విసనకర్రతో విసిరే దాన్ని. అంతకన్నా దుడ్డుకర్రతో నెత్తి మీద గట్టిగా బాదివుంటే, పీడా విరగడయి వుండేది!" అన్నది మూడో కోడలు ఉక్రోషంగా.

ఆ తర్వాత ముగ్గురూ జానకితో కవ్వింపుగా, "మతిపోయిన ముసలాళ్ళు ఏదో చెబుతారు. వాళ్ళు చెప్పినట్టల్లా చేయ గూడదన్న బుద్ధి నీకుండొద్దూ! అయినా, మనిషిపోతే కొడుకులకు కబురు పంపక, కోడళ్ళకు కబురు పంపావేం? శవాన్ని నీ ఇంట్లోనే వుంచుకో. సాయంత్రానికి ఆయన కొడుకుల్ని పంపిస్తాం," అని రుసరుసలాడుతూ, వచ్చిన బండిలోనే తిరిగిపోయారు.

కోడళ్ళ మాటలన్నీ విన్న నీలకంఠం, కొంతసేపు తన చెవులను తానే నమ్మలేక పోయాడు. కోడళ్ళ అసలు స్వరూపం తెలుసుకున్న ఆయనకు దుఃఖం పొంగుకు వచ్చింది.

జానకి, నీలకంఠం భుజం మీద అభిమానంగా చెయ్యివేసి, "చూశారా, బాబుగారూ; మనుషులు ఎలా వుంటారో! అందువల్లనే ప్రతివాళ్ళూ, తమకు చేతనైనంతలో, పోయేదాకా తమకు సరిపడ్డ డబ్బు దగ్గిర వుంచుకోవాలి. మీ కోడళ్ళు ఎవరికివారు, అరవైకాసులవడ్డాణం సొంతం చేసుకోవాలని, మీమీద ఎక్కడలేని ప్రేమా ఒలకపోశారు. మీరు ఇప్పటికయినా కళ్ళు తెరిచి, కొంత డబ్బు మీదంటూ దగ్గిర వుంచుకోండి. మా నాన్న మీలాగే కొడుకుల్ని నమ్మి, ఉన్నదంతా ఇచ్చేశాడు. కోడళ్ళు తరిమేస్తే, కూతురు దగ్గిర వుండడం ఇష్టం లేక, ఇప్పుడు నగరంలోని వృద్ధుల ఆశ్రమంలో వుంటున్నాడు. మీకు అలాంటి దుస్థితి కలగ్గూడదనే, ఈ నాటకం ద్వారా మీ కోడళ్ళకు మీమీద ఏపాటి ప్రేమ వున్నదో తెలుసుకునేందుకు చిన్న పరీక్ష పెట్టాను. మా నాన్న ఎంతో జీవితానుభవం కలవాడు. ఆయన అండ మాకు ఉన్నట్టయితే, ఇప్పుడు మాకెదురవుతున్న సమస్యల పరిష్కారానికి మంచి మంచి సలహాలిచ్చి ఆదుకునేవాడు. అలాగే, మీరూ మీ కుటుంబానికి ఎంతో సహాయంగా వుండేవాళ్ళు!" అంటూ తను అందుకుముందు తయారు చేసిన పత్రాలను చించి వేయబోయింది.

నీలకంఠం, ఆమెను వారిస్తూ, "ఆ పత్రాలు చించకు. నేను నిజంగానే, ఈ బంగారాన్ని వృద్ధుల ఆశ్రమానికి విరాళంగా ఇచ్చి, మిగిలిన జీవితకాలాన్ని అక్కడే గడిపేస్తాను. నా భార్యకు ప్రియమైన అరవైకాసులవడ్డాణం, మూసుకుపోయి వున్న నా కళ్ళను తెరిపించింది. ఆ ఆశ్రమం చిరునామా ఇవ్వు నాకు!" అన్నాడు.






## 12

[రుద్రపురి ప్రధానమంత్రీ, దుష్టమాంత్రికుడు వీరవికటుడూ కలిసి యువరాణి కంఠహారం లోని చంద్రకాంతమణిని అపహరించాలని పథకం వేశారు. వీరవికటుడు ఆ విషయాన్ని మునలి మంత్రగత్తెకు తెలియజేశాడు. యువరాణిని ప్రాణాలతో తనకు అప్పగించమని మంత్రగత్తె వీరవికటుణ్ణి అజ్ఞాపించింది. అపూర్వుడు ఆ విషయాన్ని గ్రహించాడు.—తరవాత]

సకాలంలో కావలసినంతగా వర్షాలు కురియడం వల్ల, రుద్రపురిరాజ్యమంతటా ఆ సంవత్సరం పంటలు బాగా పండాయి. ఎలాంటి లోటూ లేకుండా ప్రజలు హాయిగా వున్నారు గనక, ఆ సంవత్సరం యువరాణి జన్మదిన వేడుకలను ఘనంగా జరపాలని రాజు విశ్వవర్మ నిర్ణయించాడు. ఆ సంగతి వినగానే ప్రధానమంత్రి పట్టరాని ఉత్సాహంతో, "మన యువరాణి జన్మదిన వేడుకలను కనీ వినీ ఎరుగనంత ఘనంగా జరపాలి!" అన్నాడు. యువరాణి మీది అభిమానం కొద్దీ ప్రధానమంత్రి అలా చెబుతున్నాడని భావించి రాజు, అతడి రాజభక్తికి ఎంతగానో పొంగిపోయాడు!

ఆరోజు రాత్రి ఆకాశం నిండా మేఘాలు కమ్ముకోవడం వల్ల, కన్ను పొడుచుకున్నా కానరాని కటికచీకటి



అలముకున్నది. ఉరుములతో, మెరుపులతో అప్పుడప్పుడు వర్షం కురుస్తున్నది. ఆ వర్షంలో వీరవికటుడు నల్లటి దుస్తులు ధరించి, తన వాహనమైన ఎలుగుబంటి మీద అరణ్యం నుంచి రుద్రపురి నగర పొలిమేరలో వున్న దుర్గామాత ఆలయం కేసి వస్తున్నాడు. రాజకుటుంబానికి మాత్రమే కాదు; రుద్రపురి రాజ్యానికే ఆరాధ్యదేవత దుర్గామాత! దుర్గామాత ఆలయం భయంకరమైన అరణ్య సమీపంలో వుండడంవల్ల అక్కడ అంతగా జనసంచారం ఉండదు. రాత్రి పూటయితే ఆలయంలో కూడా ఎవరూ వుండరు. పూజారి కూడా పెందలాడే వచ్చి గుడిలో దీపం వెలిగించి వెళుతూ ఉంటాడు.

దుర్గామాత దేవాలయానికి దాదాపు వందగజాల దూరంలో అరణ్యాన్ని అనుకుని వున్న బ్రహ్మాండమైన వటవృక్షం సమీపించగానే, వీరవికటుడు ఎలుగుబంటి మీది నుంచి దిగి, భయంతో వణుకుతూన్న ఆ జంతువును, "ఇక్కడే వుండు!" అని కఠినస్వరంతో ఆజ్ఞాపించి దేవాలయం కేసి నడిచాడు.

ఎత్తయిన ఆలయ ద్వారగోపురం వద్ద నిలబడి వున్న వ్యక్తిని చూడగానే, వీరవికటుడు, "కొద్దిగా ఆలస్యమయింది, క్షమించాలి. మంత్రగత్తె దగ్గరికి మళ్ళీ ఒకసారి వెళ్ళి మాట్లాడి వస్తున్నాను, ఆమె నీకొక తాయెత్తు పంపింది. దానిని ధరించావంటే నీలోని భయాలన్నీ మటుమాయమైపోతాయి. ఆపదల నుంచి నీకు రక్షణ కలుగుతుంది," అన్నాడు

అక్కడ నిలబడిన ప్రధానమంత్రి, "ధన్యుణ్ణి! నీ మేలు ఈ జన్మలో మరిచిపోను," అంటూ వీరవికటుడికి నమస్కరించాడు.

వీరవికటుడు, తన సంచీలో దాచిన తాయెత్తును తీసి, మంత్రి మణికట్టుకు కట్టాడు. ఆ తాయెత్తును ధరిస్తే, ప్రధానమంత్రి, వీరవికటుడు చెప్పినట్టల్లా ఆడ

గలదని మంత్రగత్తె చెప్పి పంపింది. అయితే, ఆ విషయం తెలియని ప్రధాన మంత్రి దానిని చూసుకుని సంతోషంతో ఉబ్బితబ్బిబ్బయిపోయాడు!



"యువరాణి పుట్టినరోజు, ఆమె దేవీ దర్శనానికి రావడానికి తగిన శుభ ఘడియలు పంచాంగం చూసి నిర్ణయించావా?" అని అడిగాడు మాంత్రికుడు తన పొడవాటి గడ్డాన్ని చేత్తో దువ్వుకుంటూ.

"నిర్ణయించాను! సూర్యాస్తమయం అయిన ఒక గంట తరవాత శుభప్రదమని చెప్పాను!" అన్నాడు మంత్రి.

"ఆ రాత్రి చీకటిగా కూడా వుండాలి. అంటే, ఈ లెక్కన మన లక్ష్యం నెరవేర డానికి ఒక్క నెల మాత్రమే ఉందన్న మాట! అంతే కదా?" అని అడిగాడు వీరవికటుడు గర్వంగా నవ్వుతూ.

"అవును, మిత్రమా! మన పథకం నిరాటంకంగా నెరవేరగలదనడంలో నాకు ఇసుమంత సందేహం కూడా లేదు. ఇప్పుడు దేవాలయం తలుపులు తీయ డానికి కావలసిన తాళం చెవులు తెచ్చాను. రాజకుటుంబానికి చెందిన వాళ్ళు హఠాత్తుగా ఏదైనా ఆపద వాటిల్లి నప్పుడు అక్కడి నుంచి తప్పించు కోవడానికి అనువుగా, ఆలయ గర్భ గృహం నుంచి, రహస్య సొరంగమార్గం ఉన్నదని చెప్పాను కదా, దానిని ఎలా తెరవాలో, మూయాలో నాకు తెలుసు. అయినా, ఇంతవరకు దానిని ఉపయో గించుకోవలసిన అవసరం రాజకుటుం బంలో ఎవరికీ కలగలేదు. అది, ఇప్పుడు మన పథకం నెరవేరడానికి ఇలా ఉప యోగ పడనున్నది! లోపలికి వెళ్ళి చూద్దామా," అంటూ మంత్రి గుడి ద్వారం కేసి నడిచాడు ఉత్సాహంగా.

"చూద్దాం పద. అందుకే కద వచ్చింది," అన్నాడు వీరవికటుడు.

మంత్రి గుడి తలుపులు తెరిచాడు. ఇద్దరూ లోపలికి వెళ్ళి, తలుపులు మూసే శారు. లోపల మంత్రి చిన్న కాగడాను వెలి



అంతవరకూ, ఆ ఇరువురికీ తెలియకుండా వారి వెన్నంటి వచ్చిన అపూర్వుడు, గర్భగృహంలోని దుర్గామాత విగ్రహం దగ్గర నిలబడి, రహస్య సొరంగమార్గం తలుపును మూసేద్దామా అని ఒక క్షణం ఆలోచించాడు. కాని, ఆ దుర్మార్గులు సొరంగ మార్గం అవతలి వైపునుంచి తప్పించుకుని పారిపోగలరు. అందువల్ల మూసివేయడం వల్ల పెద్ద ప్రయోజనం ఏదీ లేదని ఊరుకున్నాడు. సొరంగమార్గం అవతలి చివర ఎక్కడున్నదో అపూర్వుడికి తెలియదు. దానిని తెలుసుకోవాలంటే వాళ్ళ వెంట సొరంగంలోకి దిగడమే మంచిదని అతడు ఒక్క అడుగు ముందుకు వేసేలోగా, సొరంగ మార్గ ద్వారంతో పాటు రాక్షసాకార విగ్రహం యొక్క నోరు కూడా మూసుకుపోయింది. సొరంగ ద్వారం మూయడానికి వీలుగా, సొరంగం లోపల ఏదో ఏర్పాటు ఉన్నదని అపూర్వుడు గ్రహించాడు.

గుడి తలుపులు తెరిచే ఉన్నాయి. వాటిని మూయకుండా, మంత్రీ, మాంత్రికుడూ వెళ్ళే అవకాశం లేదు. కాబట్టి తలుపులు మూయడానికి వాళ్ళు తప్పకుండా రాగలరని అనుకుంటూ, అపూర్వుడు గుడి నుంచి బయటకు వచ్చి, ఒక స్తంభం చాటున కూర్చున్నాడు.

గించి పట్టుకున్నాడు. ఇద్దరూ గర్భగృహంలోకి అడుగుపెట్టారు. దుర్గామాత విగ్రహం ముందు చిన్న చిన్న మట్టి ప్రమిదలలో దీపాలు వెలుగుతున్నాయి. దుర్గామాత విగ్రహానికీ, వెనకగోడకూ మధ్య కొంత ఖాళీ స్థలం ఉన్నది. దానిని ఆనుకుని వున్న గోడ మీద రకరకాల శిల్పాలు చెక్కబడి ఉన్నాయి. మంత్రి కాగడాను పక్కన ఆనించి, రెండు చేతులతో ఒక రాక్షసాకార విగ్రహం నోటిని తెరిచాడు. వెంటనే విగ్రహం వెనక సొరంగమార్గం తెరుచుకున్నది.

మంత్రీ, మాంత్రికుడూ ఇద్దరూ సొరంగ మార్గంలోకి దిగారు.



"నా మనుషులు కాదు; సాక్షాత్తు మంత్రగత్తే అక్కడ కాచుకుని వుంటుంది. కోడిపిల్లను, గద్ద తన్నుకుపోయినట్టు ఆమె యువరాణిని తన్నుకుపోగలదు!" అన్నాడు వీరవికటుడు గర్వంగా నవ్వుతూ.

"శభాష్! అయితే అన్నీ క్షణాలలో జరిగిపోవాలి. ఎందుకంటే వేడుకలు ఎంత కోలాహలంగా జరిగినప్పటికీ, యువరాణి ఐదారు నిమిషాలు కనిపించక పోయినా చెలికత్తెలు పసిగట్టగలరు; ఆ తరవాత ఆమెను వెదకడం ప్రారంభించ గలరు. జాగ్రత్త!" అన్నాడు మంత్రి.

"వెదకడం ప్రారంభించినా, యువ రాణిని సొరంగమార్గంలోకి తోశారని మరో కంటికి తెలిస్తేగదా పట్టుకోవడానికి? ఆలయ గర్భగృహంలోని, రహస్యమార్గం గురించి ఎంతమందికి తెలుసు?" అని అడిగాడు వీరవికటుడు.

"రాజుకూ, రాణికీ, ఆలయపూజారికీ, నాకూ, సేనానాయకుడికీ మాత్రమే ఆ రహస్యమార్గం గురించి తెలుసు. మరెవ్వ రికీ తెలియదు!" అన్నాడు మంత్రి.

"అలాగా....పూజారిని లొంగదీసుకో వడం కష్టమని అంటున్నావు. ఒకవేళ పూజారికి మన పథకం తెలిస్తే దానిని అతడు రాజుకు చెప్పే అపాయం వుంది కదా!" అన్నాడు వీరవికటుడు.

అతడు అనుకున్నట్టే ఒక గంటసేపు తరవాత, మంత్రీ, మాంత్రికుడూ గుడి నుంచి బయటకు వచ్చారు. మంత్రి తలు పులు మూసి తాళం వేస్తూ, మాంత్రి కుడితో, "నేను యువరాణిని సొరంగ మార్గంలోకి తోయగానే, ఆమెను లోపలికి తీసుకుపోయి, నేను చూపినట్టు, లోపలి నుంచి, ప్రవేశద్వారాన్ని మూసి వేయవలసిన బాధ్యత నీది. సొరంగ మార్గంకుండా యువరాణిని అరణ్య మధ్యానికి తీసుకుపోయి, నీ మనుషులకు అప్పగించాలి. వాళ్ళు ఆమెను అక్కడి నుంచి మంత్రగత్తె వద్దకు తీసుకు వెళ్ళాలి!" అన్నాడు.

''అవును, చెప్పగలడు. ఏం చేద్దాం!'' అన్నాడు మంత్రి.

"సాయంకాలం యువరాణి దుర్గామాత మందిరానికి రాకముందే, పూజారిని పరలోకానికి పంపేద్దాం. నేనే పూజారి వేషం వేసుకుని యువరాణిని దేవాలయంలోకి తీసుకుపోయి, విగ్రహానికి ప్రదక్షిణ చేయించడం శుభప్రదమని మంచి మాటలు చెప్పి, ఆమెను విగ్రహం వెనకకు తీసుకుపోయి, సొరంగమార్గంలోకి తోసి, నేనూ లోపలికి వెళ్ళి, సొరంగ మార్గద్వారం మూసేస్తాను!'' అన్నాడు వీరవికటుడు వికటంగా నవ్వుతూ.

''ఆలోచన బాగానే వున్నది. అయినా, అందుకు పూజారి ప్రాణం తీయాలా? మరొకమార్గంఏదైనా వుంటేచూడు. పూజారి చాలా మంచివాడు!'' అన్నాడు మంత్రి.

''మరీ ఇంత పిరికిగుండెకలవాడివి. రేపు ఈ భూప్రపంచాన్ని ఎలా పరిపాలించగలవు? చంద్రకాంతమణి నిన్ను ఈ ప్రపంచానికే చక్రవర్తిని చేయనున్నది! సరేలే....విచారించకు. నీ ఇష్టానుసారమే చేస్తాను. మన పని పూర్తయ్యేంత వరకు పూజారిని చంపకుండా ఎవరికీ తెలియని రహస్య స్థలంలో దాచేద్దాం. సరేనా, ఇక వెళదామా?'' అంటూ వీరవికటుడు వటవృక్షం కేసి నడిచాడు.

వాడి నుంచి అనుమతి తీసుకుని మంత్రి నగరం కేసి నడవసాగాడు.

అంతవరకు ఒక స్తంభం చాటున దాగి వారి సంభాషణలు విన్న అపూర్వుడు, ఇప్పుడు ఎవరి వెంట వెళ్ళడమా అని ఒక్క నిమిషం సందిగ్ధంలో పడ్డాడు. ఎలాగూ ఆ దుర్మార్గులు తలపెట్టిన కుట్ర తనకు తెలిసిపోయింది గనక, ఇక వాళ్ళ వెంట వెళ్ళడం కన్నా, ఆ విషయాన్ని రాజు విశ్వవర్మ దృష్టికి తీసుకు రావడం ఉత్తమం. అప్పుడే వాళ్ళ దుష్టపథకాన్ని కొనసాగకుండా ఆపవచ్చు. అయినా, ఈ విషయాన్ని రాజుగారికి తెలియజేయడం ఎలా? అని అపూర్వుడు తీవ్రంగా ఆలోచించసాగాడు. —(ఇంకావుంది)



# తెలివైన జవాబు

శివరామయ్య అనే ఒక చిన్న రైతు కొడుకూ, కోడలూ హఠాత్తుగా పోవడంతో, మనమలిద్దరి బాధ్యతా ఆయనమీద పడింది. వాళ్ళను ఆయన ఎంతో గారాబంగా పెంచాడు. ఆ ఊళ్ళో శివరామయ్యకు ఇల్లు తప్పించి, మరే ఆస్తీ లేదు. ఆయన వయసుమీదపడే కొద్దీ మనమళ్ళ గురించి దిగులుపడసాగాడు. వాళ్ళిద్దరూ ఏమీ బాధ్యత తెలియనట్టుగా ప్రవర్తించేవారు.

ఇలా వుండగా శివరామయ్య చిన్ననాటి స్నేహితుడైన కోదండం, ఆయన్ని చూసిపోదామని వచ్చాడు. శివరామయ్య అతడికి తన మనమళ్ళ గురించి చెప్పాడు.

కోదండం, శివరామయ్య మనమళ్ళిద్దర్నీ పిలిచి, "చూడండి! నేను మిమ్మల్ని ఒక ప్రశ్న అడుగుతాను. మీరు బాగా ఆలోచించి దానికి సమాధానం చెప్పాలి. ఎవరు తెలివిగా సమాధానం చెబుతారో వాళ్ళకు, పదిరూపాయలిస్తాను," అన్నాడు.

దానికి ఇద్దరూ సరేనని తలలూపారు. కోదండం వాళ్ళతో, "మీకు దేవుడు ప్రత్యక్షమైతే ఒకే ఒక వరం కోరుకోవాలి. అది మీకు వీలైనంత లాభదాయకంగా వుండాలి. ఏం కోరుకుంటారు?" అన్నాడు.

పెద్దవాడు బాగా ఆలోచించి, "నాకు ఏ లోటూ లేకుండా బతకడానికి అవసరం అయిన పొలం ఇవ్వమని అడుగుతాను," అన్నాడు.

తర్వాత రెండవవాడు, "పొలం ఎవరిక్కావాలి! నేను తలచుకున్నప్పుడల్లా, ఏది కోరుకుంటే అది ప్రసాదించగల, ఒక ఉంగరం ఇవ్వమని అడుగుతాను. అప్పుడిక నాకేలోటూ వుండదు," అన్నాడు.

కోదండం నవ్వి చిన్నవాడికి పదిరూపాయలిచ్చి, తర్వాత శివరామయ్యతో మాట్లాడుతూ, "నీకున్న ఈ ఇంటిని పెద్దవాడికివ్వు. వాడు ఉన్న ఊళ్ళో ఎలాగో బతగ్గలడు. చిన్నవాడి గురించి నువ్వు దిగులుపడనవసరంలేదు. వాడు బతకనేర్చినవాడు. వాణ్ణి నావెంట తీసుకుపోయి, ముందు ముందు నీకూ, అన్నకూ సాయపడగలవాడిగా తయారుచేసి పంపుతాను," అన్నాడు.

శివరామయ్య, కోదండం చెప్పినట్టే చేసి, ఏ దిగులూ లేకుండా సుఖంగా కాలం వెళ్ళబుచ్చాడు.

—దాసరి వెంకటరమణ





# మాటతప్పిన రాజు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, ఇంత అర్ధరాత్రివేళ, ఇన్ని శ్రమలకు గురి అవుతున్న నిన్ను చూస్తుంటే జాలి కలుగుతున్నది. ఎవరికోసం నువ్విన్ని శ్రమలకోర్చుతున్నావే, నాకు తెలియదు. నువ్వు దేశ పాలకుడివైన రాజువి కనక, ఏదో ఒక సామాన్యవ్యక్తి కోసం, ఇంత పట్టుదల వహించావని నేననుకోను. ఒక వేళ, నిన్నీ కార్యానికి ప్రోత్సహించిన వాడు, మరొక రాజయినా లేక చక్రవర్తి అయినా, తాము అన్న మాటకూ, ఎంతగానో తర్కించి తీసుకున్న నిర్ణయాలకూ కట్టుబడి వుంటారని నమ్మడం, ఒక్కొక్క సారి ఆశాభంగానికి కారణమవుతుంది.

## బేతాళ కథలు



ఇందుకు ఉదాహరణగా, ఒక మాట తప్పిన రాజూ, వీరుడైవుండీ భీరువుగా ప్రవర్తించిన ఆటవికయువకుడూ, ఆఖరి క్షణంలో అవివేకంగా ప్రవర్తించిన రాజకుమార్తే—ఈ ముగ్గురికథా చెబుతాను, శ్రమ తెలియకుండా, విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు:

సువిశాల అనే రాజ్యానికి పద్మాక్షుడు రాజు. ఆయన పాలనలో, ప్రజలు ఎంతో కాలంగా సుఖశాంతులతో వున్నా, ఒకానొక క్రూరమృగం కారణంగా రాజులోనూ, ప్రజలలోనూ భయం, అశాంతీ ప్రబలసాగినై. ఆ మృగం ఏ అర్ధరాత్రివేళనో వచ్చి, రాజధాని శివార్లలో వున్న గ్రామాల మీద పడి మనుషులను చంపసాగింది. ఆ మృగం ఎక్కడి నుంచి ఎలా వస్తుందో ఎవరికీ అంతు చిక్కలేదు. అది మనుషులను చంపి, బతికిన గ్రామస్థులు కాగడాలతోనూ, దివిటీలతోనూ ఇళ్ళలో నుంచి బయటికి రాగానే, ఎటో పారిపోయేది.

ఆ క్రూరమృగాన్ని పట్టి వధించమని రాజు పద్మాక్షుడు ఎందరో సైనికులను పంపాడు. వాళ్ళు దాన్ని చంపలేకపోగా, కొందరు దానికి బలైపోయారు. ఆ మృగం చేస్తున్న ఘోరాలకూ, బీభత్సానికీ రాజు ఎంతో బాధపడసాగాడు. ఈ విధంగా ప్రజల ప్రాణాలకు రక్షణ లేకపోవడం చూసి రాజు, మంత్రితోనూ, యువరాణి వివేకవతితోనూ సంప్రతించి, ఒక నిర్ణయానికి వచ్చాడు.

అదేమంటే—క్రూరమృగాన్ని చంపగల వీరులకోసం, రాజ్యమంతటా దండోరా వేయించడం! ఆ మృగాన్ని చంపిన వీరుడికి అర్ధరాజ్యంతోపాటు, తన కుమార్తెను కూడా ఇచ్చి వివాహం చేయగలనని ప్రకటించాడు రాజు. ఇందుకు వివేకవతి కూడా సమ్మతించింది.

ఇది జరిగాక రాజ్యంలోని ఎందరో యువకులు, క్రూరమృగాన్ని చంపడానికి బయలుదేరి, దానివల్ల ప్రాణాలు కోల్పోయారు.

ఈ పరిస్థితుల్లో, రాజ్యం పొలిమేరల్లోని అరణ్యంలో నివసిస్తున్న, ఒక ఆటవిక నాయకుడి కొడుకు, వీరవరుడనేవాడు క్రూర మృగాన్ని చంపడానికి బయలు దేరాడు. వాడు పక్షం రోజులపాటు రాత్రి వేళ దానికోసం వెతికి, చివరకు అది ఒక వాగు ఒడ్డున వున్న పొదల్లో దాగి వున్నట్టు తెలుసుకున్నాడు.

వాడు దాపులనున్న చెట్టు ఎక్కి, అక్కడి నుంచి మృగాన్ని పరీక్షగా చూసి ఆశ్చర్యపోయాడు. అలాంటి మృగాన్ని వాడు అంతవరకూ ఏనాడూ చూడలేదు. దాని తల పెద్ద జూలుతో సింహం ఆకారంలో వున్నది. మిగతా శరీరం చారలతో పులిరూపంలో ఉన్నది!

వీరవరుడు, ఆ వింతమృగం మీద ముందు ఈటెను విసరడమా లేక బాణం ప్రయోగించడమా, అని ఆలోచిస్తున్నంతలో, అది తల ఎత్తి చెట్టుకేసి చూసి, సింహగర్జనా, పులిగాండ్రింపూ మేళవించి నట్టున్న భయానకమైన అరుపుతో, పొదలలో నుంచి బయలుదేరి చెట్టును సమీపించింది. వీరవరుడు అదే అదనుగా బాణాన్ని దాని గుండెలకు తాకేలా వదిలాడు.

బాణం దెబ్బ తింటూనే మృగం భీకరంగా అరుస్తూ, చెట్టు కొమ్మల్లో వున్న వీరవరుడి కేసి ఎగిరింది. ఈసారి వాడు ఈటెను దాని కంఠానికి తగిలేలా బలంగా విసిరాడు. ఈటె దెబ్బ తింటూనే






ఒక ఆటవికయువకుడు, ఒంటరిగా సాహసించి క్రూరమృగాన్ని చంపాడన్న వార్త, రాజు పద్మాక్షుడికి చేరింది. ఇది విని ఆయన మొదట సంతోషించినా, ఆ తర్వాత విచారగ్రస్తుడయ్యాడు. ఎందుకంటే—ఆయనకు అందిన సమాచారాన్ని బట్టి, ఆ ఆటవిక యువకుడు అక్షరజ్ఞానం లేనివాడు; అనాకారి! అటువంటివాణ్ణి తాను అల్లుడుగా చేసుకోవాలన్న తలపు రాగానే, ఆయన చాలా కలవరపాటు చెందాడు.

రాజు, తాను అర్ధరాజ్యంతో పాటు, కుమార్తెను కూడా ఇచ్చి వివాహం చేస్తానని ప్రకటించగానే, ఏ రాజకుమారుడో వచ్చి, ఆ క్రూరమృగాన్ని చంపుతాడనుకున్నాడు. కాని, ఇప్పుడు జరిగింది వేరు. ఒక తక్కువజాతివాడూ, అనాకారీ ఆ కార్యాన్ని సాధించాడు!

ఇప్పుడు ఏమి చేయడమా అన్నదాన్ని గురించి పద్మాక్షుడు, మంత్రితోనూ, కుమార్తెతోనూ చర్చించాడు. వాళ్ళు కూడా సందిగ్ధంలోనేపడ్డారు. అది రాజవంశానికి ఎంతో కళంకం అని భావించారు.

"ఒక పని చెయ్యండి, నాన్నా! ఆ వీరవరుణ్ణి ఒంటరిగా పిలిచి, అర్ధరాజ్యం మాత్రమే ఇస్తానని చెప్పి చూడండి," అన్నది యువరాణి వివేకవతి.

వింతమృగం వెల్లకిలాపడి లేచి, అరుస్తూ వాగుకేసి పారిపోచూసింది. కాని, వీరవరుడు చెట్టు దిగి దాన్ని బాణాలతో కొట్టాడు. మృగం కర్ణకఠోరంగా అరుస్తూ, వాగు ఒడ్డునపడి కాసేపు గిలగిలా తన్నుకుని ప్రాణాలు వదిలింది.

తెల్లవారుతూనే, ఆ చుట్టుపక్కల వున్న గూడేలలోని ఆటవికులు అక్కడికి వచ్చి, ఆ వింతమృగాన్ని చూసి అమితాశ్చర్యం చెందారు. తమ నాయకుడి కొడుకు దాన్ని చంపి, రాజకుమార్తెను పెళ్ళాడడమే కాక, అర్ధరాజ్యానికి రాజు కాబోతున్నందుకు పరమానందం చెందారు.

"అవును. అలా చేయడం బావుంటుంది. అర్ధరాజ్యం ఇచ్చి ఏలుకోమంటే, వీరవరుడు తప్పక సంతోషంగా అంగీకరిస్తాడు. అయితే, రాజకుమార్తెను వివాహం చేసుకోవడానికి, తాను తగినవాడిని కాననీ, తానుగానే అందుకు తిరస్కరించాననీ, వాడిచేతే అటవికులకూ, రాజ్యప్రజలకూ చెప్పించాలి. అప్పుడు మనం అన్నమాట తప్పినట్టు వుండదు," అని మంత్రి సలహా ఇచ్చాడు.

రాజుకు, ఈ సలహా నచ్చింది. ఆయన వీరవరుడికి కబురుచేసి, ఘనంగా సత్కరించి, రహస్యమందిరంలో విడిదిఏర్పాటు చేశాడు. తర్వాత ఆయనా, మంత్రీ, యువరాణి వివేకవతీ వాణ్ణి కలుసుకుని, తాము అనుకున్న విషయం చెప్పి, అందుకు ఒప్పుకోమన్నారు.

వీరవరుడు ఒక క్షణంపాటు ఆలోచించి, "మహారాజా, నాకు అర్ధరాజ్యం కూడా ఇవ్వనవసరం లేదు. నేను కేవలం బహుమానం ఆశించి, ఆ క్రూరమృగాన్ని చంపలేదు. ఈ రాజ్యపౌరుడుగా, చేతనైనంతలో ప్రజలను ప్రాణాపదనుంచి కాపాడవలసిన బాధ్యత నాకున్నది. అర్ధరాజ్యాన్నీ, రాకుమారినీ నాకై నేనే తిరస్కరించానని ప్రజలకు చెబుతాను. క్షమించండి!" అంటూ అక్కడి నుంచి బయలుదేరాడు.




సమస్య ఇంత తేలిగ్గా పరిష్కారమైనందుకు రాజూ, మంత్రీ చాలా సంతోషించారు. అయితే, యువరాణి వివేకవతి, వీరవరుణ్ణి ఆగమని కేకవేసి, తండ్రితో, "నాన్నా! ఆ అటవిక యువకుడికి అర్ధరాజ్యం ఇచ్చినా, ఇవ్వకపోయినా ఫర్వాలేదు. మన్నించండి! నేను అతణ్ణి వివాహమాడదలచాను. అందుకు అనుమతించండి!" అన్నది నిబ్బరంగా.

ఇది విని రాజు పద్మాక్షుడూ, మంత్రీ నిశ్చేష్టులైపోయారు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, వీరవరుడు అర్ధరాజ్యాన్నీ, రాకుమార్తెనూ తనవిగా చేసుకోవాలనే, ప్రాణానికి

తెగించి క్రూరమృగాన్ని చంపాడు. ఆ ఆశతోనే రాజు కబురంపగానే, అతడి భవనానికి వచ్చాడు. అలాంటివాడు, రాజకుమార్తెతో వివాహం పొసగదని రాజు చెప్పగానే, వీరుడైవుండీ, భీరువులా తాను బహుమానం ఆశించి క్రూరమృగాన్ని చంపలేదని అబద్ధం చెప్పి, అర్ధరాజ్యాన్ని కూడా వద్దని ఎందుకు తిరస్కరించాడు? అప్పటివరకూ అనాకారీ, తక్కువజాతి వాడూ అయిన వీరవరుణ్ణి వివాహమాడడానికి అంగీకరించని వివేకవతి, చివరి క్షణంలో మనసు మార్చుకుని, అతణ్ణి వివాహం చేసుకుంటానని చెప్పడానికి కారణం ఏమిటి? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "పద్మాక్షుడు రాజు. ప్రజాపాలకుడే అడిన మాట తప్పాడు. అది రాజలక్షణం కాదు. పైగా, రాజు తానుగా యువరాణితో వివాహం కుదరదని చెప్పి, వీరవరుడే తిరస్కరించినట్టుగా నలుగురితో చెప్పమని అడగడం, వీరవరుడికి మనస్తాపం కలిగించింది. మాట నిలకడలేని రాజు నుంచి అర్ధరాజ్యం పుచ్చుకుని పాలించ ప్రయత్నించడం అవివేకమూ, ప్రమాదకరమూ అని భావించి—తానుగానే రెండూ తిరస్కరించినట్టుగా ప్రజలకు చెబుతానన్నాడు, వీరవరుడు. ఇక వివేకవతి మనసు మార్చుకోవడానికి కారణం, హీనజాతివాడనీ, అనాకారి అనీ మొదట్లో వీరవరుడితో వివాహం వద్దనుకున్నా, అక్షరజ్ఞానం లేకపోయినా అతడిలో వున్న సంస్కారానికీ, అనాకారి అయినా అతడి గొప్ప గుణానికీ, అమె చాలా ఆనందించింది. అందువల్లనే అమె, వీరవరుడితో వివాహానికి తండ్రి అనుమతి కోరింది. ఈ నిర్ణయంలో అవివేకం ఏమీలేదు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)

[ఆధారం: ఆర్. రేవతి రచన]





# పుష్పకవిమానం

విక్రమపురి మహారాజు ధీరసింహుడు, ఒకరోజు రాజోద్యానవనంలో కూర్చుని, కొంతమంది ముఖ్యులతో రాచకార్యాలు ముచ్చటిస్తున్నాడు. ఆ సమయంలో వున్నట్టుండి ఆయన ఆకాశంవంక చూస్తూ, "చూడండి! ఆకాశమార్గంలో ఏదో విమానం వంటిది పోతున్నది. దానిని చూస్తుంటే, అందులో వున్నవారు గంధర్వులేమో అన్న అనుమానం కలుగుతున్నది," అన్నాడు.

అప్పుడు చంద్రకేతుడనేవాడు ఆకాశం కేసి చూసి, "మహారాజా! తమ దృష్టి అతి నిశితం. వెళుతున్నది పుష్పకవిమానాన్ని పోలివున్నది. అందులో గంధర్వులో, దేవతలో కాక మరెవరుంటారు!" అన్నాడు.

సూర్యబాహు అనే మరొకతను, "మహారాజా! చంద్రకేతుడన్నదినిజం," అన్నాడు.

తక్షశిలానగరంలో ఉన్నతవిద్యాభ్యాసం చేసి, తిరిగి వచ్చిన రాజపురోహితుడి కుమారుడు పద్మనేత్రుడుకూడా అక్కడున్నాడు. అతడు తప్ప మిగిలినవాళ్ళందరూ సూర్యబాహు, చంద్రకేతులతో శ్రుతి కలుపుతూ, మహారాజు పుణ్యాత్ముడు కనకనే, అటువంటి అపురూప దృశ్యాన్ని తాను చూడడమే కాక, తమబోటి అల్పులకు కూడా చూపగలిగాడని, ధీరసింహుడి మీద పొగడ్తల వర్షం కురిపించసాగారు.

పద్మనేత్రుడి మౌనాన్ని గమనించి ధీరసింహుడు, "ఏమయ్యా, పద్మనేత్రా! అలా బెల్లంకొట్టినరాయిలా వుండిపోయావు. విమానం నీకు కనబడలేదా ఏమిటి?" అని మందహాసం చేస్తూ అడిగాడు.

"ప్రభువులు మన్నిస్తానంటేనే, జవాబిస్తాను," అన్నాడు పద్మనేత్రుడు.

"నీకు వచ్చిన భయమేమీలేదు. నువ్వు చెప్పాలనుకున్నది నిశ్చింతగా చెప్పు," అన్నాడు ధీరసింహుడు.

జొన్నలగడ్డ రత్న

అందుకు పద్మనేత్రుడు, "ప్రభూ! ఇప్పుడు ఆకాశంలో ఎలాంటి విమానమూ వెళ్ళలేదు. అంతావట్టి భ్రమ," అన్నాడు.

రాజు చిరుకోపంగా, "నాతో సహా, ఇక్కడున్న ఇంతమంది కళ్ళారా చూసిన పుష్పకవిమానాన్ని, భ్రమ అని తేలికగా కొట్టిపారవెయ్యడానికి తగిన కారణమేమైనా వున్నదా?" అని ప్రశ్నించాడు.

పద్మనేత్రుడు వినయంగా, "ప్రభూ! పుష్పకవిమానాలూ, గంధర్వుల ఆకాశ విహారం వంటివి ఊహల్లోని విషయాలని, హేతుబద్ధంగా ఆలోచించే తమబోటి మేధావులకు తెలియనిది కాదు. నేను కూడా, ఈ సృష్టిలో హేతుబద్ధం కానిదేదీ లేదన్న నమ్మకం వున్నవాణ్ణి. ఎప్పుడైనా మనకళ్ళకూ, చెవులకూ అసాధారణమైన దేదైనా కనిపించినా, వినిపించినా— అందుకు కారణం మన మానసిక బలహీనత కాని, శరీరంలో వున్న మరేదైనా రుగ్మత కాని కారణం కావచ్చును. కాని, తమకు కలిగినభ్రమలాంటిదే, ఇక్కడున్న ఇంతమందికీ కూడా ఒకేసారి ఎందుకు కలిగిందీ అన్నవిషయాన్ని మాత్రం నేను ప్రస్తావించలేదు. ఆ భ్రమకు కారణం వారందరికీ తెలియనిది కాదు, అన్న విషయం మాత్రం, నాకు తెలుసు!" అన్నాడు.

ఇది విన్న ధీరసింహుడు, అక్కడ వున్న వారందరితో, "పద్మనేత్రుడన్నది నిజం! నేనెలాంటి విమానాన్నీ, గంధర్వులనూ చూడనేలేదు. రాజ్యంలో ప్రస్తుతం వున్న పరిస్థితులన్నిటినీ, ఎప్పటికప్పుడు నాకు చూసినది చూసినట్లు, చెప్పగలిగే సలహాదారుణ్ణి అన్వేషించే ప్రయత్నంలో, ఈ విమానంవ్యవహారంసృష్టించాను. రాజసభలో వున్న మిత్రులైన మీరంతా, నన్ను పొగుడుతూ నాచేత సన్మానాలు చేయించుకోవాలన్న తాపత్రయంలో, వాస్తవాలను నిర్భయంగా నాకు చెప్పి, నా పరిపాలనను మెరుగుపరచాలన్న బాధ్యతను విస్మరించారు. అలాంటి బాధ్యత తెలుసుకున్న ఈ పద్మనేత్రుణ్ణి, నేను ముఖ్య సలహాదారుగా నియమించదలుచుకున్నాను," అన్నాడు.



# చందమామ అనుబంధం—40



మనదేశపు పక్షులు-జంతువులు :

## పులి

గంభీరమైన పెద్దపులులు, బెంగాల్‌లోని 'సుందరబన్' అరణ్యప్రాంతంలో ఒకప్పుడు ఎక్కువగా ఉండేవి. పులి వన్యమృగాలకు రాజు వంటిది. పూర్వకాలంలో రాజులు తరచూ పులివేటకు వెళ్ళేవారు. వీరులైన రాజులు, పులివేటను ప్రధాన వినోద క్రీడగా భావించేవారు. అలా వేటాడడం వల్లే పులుల సంఖ్య అమితవేగంతో తగ్గిపోయింది. ఒకప్పుడు మన దేశంలో 40 వేల వరకు ఉన్న పులుల సంఖ్య, 1972వ సం॥ నాటికి రెండువేలకు తగ్గిపోయింది. మరి కొన్నాళ్ళలో పులి సంతతి నశించే అపాయం రాగలదన్న స్థితి ఏర్పడింది. అందువల్ల వాటిని రక్షించడానికి మన ప్రభుత్వం గట్టి చర్యలు తీసుకోసాగింది. పులిని మన 'జాతీయమృగం'గా ప్రకటించింది. ఇప్పుడు మన దేశంలోని వివిధ ప్రాంతాలలోనూ, జంతుప్రదర్శన శాలలలోనూ వున్న పులుల సంఖ్య నాలుగువేలకు పెరిగింది.

పిల్లిజాతికి చెందిన పులి, కదిలే ప్రతి ప్రాణినీ పట్టితినగల మాంసాహార జంతువు. అయినా, కణుజులనూ, లేళ్ళనూ, అడవిపందులనూ ఇష్టంగా చంపి తింటుంది. పచ్చటి అడవులలో నివసించే పులి, మరే అహారం దొరకనప్పుడు నీళ్ళలో ఈదుతూ, చేపలను పట్టితింటుంది. తల నుంచి తోక వరకు పులి పొడవు 8-9 అడుగులు వుంటుంది. దాదాపు 200 కి॥ గ్రా॥ బరువు ఉంటుంది. సాధారణంగా పులి 15-20 సంవత్సరాలవరకు జీవిస్తుంది.



# బాలవిద్వాంసుడు!

మద్రాసు నగరంలో ఇటీవల జరిగిన ఒక సంగీతోత్సవంలో పన్నెండేళ్ళ శశాంక, రెండు గంటలసేపు అద్భుతంగా ఫ్లూట్ వాయించి, శ్రోతలకు ఆనందాశ్చర్యాలు కలిగించాడు. సంగీతోత్సవాలలో సాధారణంగా, సాయంకాలం 6 నుంచి 9 గం॥ వరకు పేరు ప్రఖ్యాతులు గడించిన సంగీత విద్వాంసులకే కేటాయించడం ఆనవాయితీ. అటువంటి ముఖ్యమైన సమయాన్ని, పన్నెండేళ్ళ బాలవిద్వాంసుడికి కేటాయించారు. ఉత్సవ కార్యకర్తల నమ్మకానికి అనుగుణంగా, శశాంక అద్భుతమైన వేణుగానం వినిపించి సంగీత అభిమానులను ఆనందింప జేయడమే కాకుండా, విమర్శకులను సైతం మెప్పించ గలిగాడు.

శిశువుగా ఉన్నప్పుడే శశాంక, సంగీతం పట్ల అమిత ఆసక్తి కనబరచసాగాడు. శశాంక తండ్రి సుబ్రహ్మణ్యం కూడా ఫ్లూట్ విద్వాంసుడే. ఆయన కొన్ని రాగాలను ఆలపించినప్పుడు, శిశువుగా వున్న శశాంక ఆసక్తిగా వినేవాడు. మరికొన్ని రాగాలను వినిపిస్తే ఏడ్చేవాడు. అలా సంగీత వాతావరణంలో పెరిగి శశాంక మూడేళ్ళ ప్రాయంలోనే ముఖ్యమైన దాదాపు 70 రాగాలను గుర్తు పట్టగలిగాడు. బిడ్డ సంగీత ఆసక్తిని గమనించిన తండ్రి అతనికి చిరుప్రాయంనుంచే సంగీత శిక్షణ ప్రారంభించాడు. తండ్రి మొదట వయొలిన్ వాద్యం కూడా నేర్పించాలనుకున్నాడు గాని, శశాంక మాత్రం, తండ్రి వాయించే వేణువును తీసుకుని వాయించడానికే ఆసక్తి కనబరచాడు. అందుకు కారణం, తండ్రి రోజూ వేణువుతో సాధనచేస్తూన్నప్పుడు ఆయన వేళ్ళ కదలికను గమనించి తనూ అలాగే వాయించడం పారంభించి వుండవచ్చు.

శశాంకకు సంగీతంలో చక్కని శిక్షణ ఇవ్వడానికి అనుకూలంగా వుంటుందని, వాళ్ళ కుటుంబం బెంగళూరు నుంచి మద్రాసు వచ్చి స్థిరపడింది. అందుకోసం శశాంక తండ్రి తన కళాశాల అధ్యాపక వృత్తిని కూడా వదులుకున్నాడు!

శశాంక, పదవయేట ఆస్ట్రేలియాలోని అడెలేడ్‌లో ప్రప్రథమంగా రంగప్రవేశం చేశాడు. అక్కడినుంచి స్వదేశానికి తిరుగుప్రయాణంలో సింగపూర్‌లోనూ, మలేసియాలోనూ కచేరీలు చేశాడు. మన దేశంలో మొట్టమొదటి సారిగా 1990 వ, సం॥ సెప్టెంబర్‌లో బొంబాయిలోని ఒక ప్రతిష్ఠాత్మకమైన సభాప్రాంగణంలో అతని కచేరీ జరిగింది. ఆ తరవాత ఇతర ప్రముఖ సంగీత సాంస్కృతిక సంస్థలు అతన్ని ఆహ్వానించడం ప్రారంభించాయి.

మిగతా విషయాలలో శశాంక అందరి పిల్లలలాగే ప్రవర్తిస్తాడు. బడికి వెళ్ళాలంటే అయిష్టత కనబరుస్తాడు. ఒక్కొక్కసారి మంకు పట్టుదల చూపుతాడు. వేణువును అసలు ముట్టుకోడు. అలాంటప్పుడు అతన్ని దారిలో పెట్టడానికి, మంచిమాటలూ, ఒక్కొక్కసారి గట్టిగా మందలింపులూ అవసరమవుతాయి— అన్నాడు అతని తండ్రి. తన ఈడు మగ పిల్లలతో కన్నా, తన సోదరితో కలిసి ఆడుకోవడానికే శశాంక ఇష్టం చూపుతాడు. అవకాశం ఇస్తే అతడు ఎప్పుడూ ఆడియో కేసెట్లు వింటూనే కాలం గడిపేస్తాడు.

ఇంతకూ, వాళ్ళ కుటుంబం ఒక్క శశాంక సంపాదన మీదే ఆధారపడి ఉన్నదంటే ఆశ్చర్యంగా లేదూ!

# మీకు తెలుసా?

1. ఐక్యరాజ్యసమితి మొట్టమొదటి ప్రధాన కార్యదర్శి ఎవరు?
2. 'కామన్వెల్త్ దినం' ఎప్పుడు జరుపుకుంటారు?
3. జవహర్‌లాల్ నెహ్రూ జైలులో ఉన్నప్పుడు 'డిస్కవరీ ఆఫ్ ఇండియా' అనే గ్రంథం రాశారు. ఏ జైలులో ఉన్నప్పుడు రాశారు?
4. 'ది లేడీ విత్ ది ల్యాంప్' అని ప్రసిద్ధి గాంచిన వనిత ఎవరు?
5. మహమ్మదు ప్రవక్త తల్లిదండ్రు లెవరు?
6. 'ఎగిరే పళ్ళాలు'ను చూసినట్టు మొట్టమొదట ఎప్పుడు చెప్పుకున్నారు?
7. ఏసుక్రీస్తును శిలువ చేసినప్పుడు ఆయన తన తల్లి మేరీ క్షేమాన్ని చూసుకోమని ఒక శిష్యుణ్ణి కోరాడు. ఆ శిష్యుడు ఎవరు?
8. 'ఓల్డ్ టెస్టామెంట్'లో నోవా పితామహుడుగా చెప్పబడినవారెవరు?
9. చంద్రుడిలో మొట్టమొదట దిగిన మానవనిర్మిత పరికరం ఏది?
10. మావోసేటుంగ్ 'పీపుల్స్ రిపబ్లిక్ ఆఫ్ చైనా'ను ఎప్పుడు స్థాపించారు?
11. 'అట్లాంటిస్'ను తన రచనలలో వర్ణించిన రచయిత ఎవరు?
12. 'రైటు సోదరులు' మొట్టమొదట విమానప్రయాణం చేశారు. వాళ్ళు వృత్తిరీత్యా ఏం చేసేవారు?
13. ఇటలీకి చెందిన ఒక లేడీ డాక్టర్ ఆమె వృత్తికి భిన్నమైన రంగంలో కీర్తి గడించారు. ఆమె ఎవరు?
14. అమెరికాకు చెందిన ఒక నటీమణి చిత్రాన్ని మొట్టమొదట తపాలాబిళ్ళ మీద విడుదల చేశారు. ఆమె ఎవరు?
15. క్రికెట్ జాతీయక్రీడగా గల దేశం ఏది?

## సమాధానాలు

1. ట్రిగ్వే లీ.
2. మే 24.
3. అహ్మద్‌నగర్ ఫోర్ట్.
4. ఫ్లారెన్స్ నైటింగేల్.
5. అబ్దుల్లా–అమీనా.
6. 1947వ సం॥ జూన్ 24.
7. జాన్.
8. మెథుసెలా.
9. రష్యా పంపిన లూనా—2; 1959 సెప్టెంబర్ 13.
10. 1949 సెప్టెంబర్ 21. దానిని సోవియట్ యూనియన్ మొట్టమొదట గుర్తించింది.
11. గ్రీకు తత్వవేత్త ప్లాటో.
12. సైకిల్‌షాపు-ఫ్యాక్టరీ నడిపేవారు.
13. మరియా మాంటిస్సోరి: సుప్రసిద్ధ విద్యావేత్త.
14. గ్రేస్ కెల్లీ. 'ది కంట్రీ గర్ల్' చిత్రంలో నటించి నందుకు 'ఆస్కార్' ఉత్తమ నటి బిరుదు పొందింది.
15. ఆస్ట్రేలియా.

## పసివాడి పసిడిమనసు!

ఇటీవల ఉత్తరప్రదేశ్‌లో భూకంపం వల్ల పెద్ద నష్టం వాటిల్లింది. భూకంప బాధితుల నివారణ నిధికి, వివిధ ప్రభుత్వాలూ, పెద్దలూ విరాళాలు పంపారు. భూకంప బాధితులయిన కుర్రవాళ్ళు పడిన బాధలను టీవీలో చూసి చలించిపోయిన ఒక చైనా కుర్రవాడు కూడా 600 రూపాయలు పంపాడు. చైనాలోని షాంఘైకి చెందిన యాన్ పెంఫీ అనే ఈ పదేళ్ళ కుర్రవాడు ఈ 100 యువాన్ల మొత్తాన్ని తన తండ్రి ద్వారా బీజింగ్‌లోని భారత రాయబారి కార్యాలయానికి పంపాడు. ఈ మొత్తం అతడు ఒక టీవీ సీరియల్‌లో నటించినందుకు వచ్చిన పారితోషికంలో సగం. మిగతా సగాన్ని అతడు అంతకు ముందే చైనాలోని వరదబాధితులకు పంపివేశాడు!

# చందమామ కబుర్లు

## పడవపై పసిఫిక్ ప్రయాణం!

" ఒక నిమిషం ఒక గంట లాగా, ఒక గంట ఒక రోజు లాగా గడిచింది!" అన్నాడు తెడ్ల పడవతోనే పసిఫిక్ మహాసముద్రాన్ని దాటిన ఫ్రాన్స్‌దేశానికి చెందిన జెరార్డ్ డి. అబోవిల్. ఆయన వయసు 41 సంవత్సరాలు.

8 మీటర్ల పొడవు పడవ మీద జపాను తూర్పు తీరంలో జూలై 11 వ తేదీ బయలుదేరి, ఆయన 10,000 కి.మీ. దూరాన్ని 133 రోజులు ప్రయాణం చేసి, నవంబర్ 21 వ తేదీ అమెరికా ఓరిగాన్, పోర్ట్‌ల్యాండ్ సమీపంలోని ఇల్వాకీని చేరుకున్నాడు. అప్పుడాయన శారీరకంగా అలసిపోయినప్పటికీ చాలా ఆనందంగా కనిపించాడు!





# మోసేవాడి బరువు....

గోపాలపురం అనే ఊళ్ళో, గోవిందయ్య అనే ధనవంతుడుండేవాడు. ఆయనకు ఎన్నో రకాల వ్యాపారాలుండడం వల్ల, పనులు చేసేందుకు చాలా మంది నౌకర్లుండేవాళ్ళు. వాళ్ళ కష్టసుఖాల గురించి ఏమాత్రం పట్టించుకోని గోవిందయ్య వాళ్ళచేత తలకు మించిన బరువులు మోయించేవాడు. మండుటెండలో మంచినీళ్ళకైనా వెళ్ళనీయకుండా వాళ్ళ చేత చాకిరీ చేయించేవాడు. అయినా రెక్కాడితే గాని డొక్కాడదని, ఆ నౌకర్లు నోరెత్తకుండా యజమాని చెప్పిన పనులు చేసుకుపోయేవారు.

అయితే, ఇదంతా గోవిందయ్య భార్య సీతమ్మకూ, కొడుకు శివయ్యకూ చాలా బాధగా వుండేది. వాళ్ళు గోవిందయ్యలో మార్పు తీసుకురావాలని ఎన్నో విధాలుగా ప్రయత్నించి ఓడిపోయారు.

గోవిందయ్యకు ఒక చక్కని గుర్రబ్బండి వుంది. ఆ బండిలోనే ఆయన తరచుగా, ఊరుకు కొంతదూరంలో వున్న పట్నానికి వెళ్ళివస్తూండేవాడు. ఆయన గుర్రాన్ని అపురూపంగా చూసుకున్నా, బండినితోలే వీరయ్యను మాత్రం మిగతా నౌకర్లలాగే చూసేవాడు. వృద్ధుడని అయినా జాలి తలిచేవాడు కాదు.

పట్నానికి వెళ్ళాలంటే, ఒక అడవి దాటాలి. ఆ అడవిలో రకరకాల క్రూర మృగాలతోపాటు కొందరు బందిపోటు దొంగలు కూడా వున్నారని, అందరూ చెప్పుకునేవారు. ఆ కారణంగా, చీకటి పడ్డాక ఎవరూ ఆ అడవికుండా ప్రయాణం చేసేందుకు సాహసించేవాళ్ళుకాదు.

ఒకనాడు గోవిందయ్య, పట్నంలో వున్న బంధువుల ఇంటి పెళ్ళికి భార్యనూ,

రావినూతల సువర్నాకన్నన్



కొడుకునూ వెంటబెట్టుకుని బయలుదేరాడు. సీతమ్మ వెంట చాలా సామానున్నది. కొడుకు చెప్పినమీదట, గోవిందయ్య వ్యాపారానికి సంబంధించిన కొన్ని వస్తువులు, రెండుపెట్టెలనిండా సర్ది, బండిలో పెట్టాడు.

బాగా తెల్లవారకముందే బయలుదేరిన గుర్రబ్బండి, అడవి చేరేసరికి మిట్ట మధ్యాహ్నం అయింది. బండి తోలుతున్న వీరయ్య హఠాత్తుగా రెండు చేతులతో గుండె పట్టుకుని, బండిలో నుంచి కిందికి జారాడు. ఆ మరుక్షణం గుర్రం కట్లు తెంచుకుని చెట్లల్లోకి పరుగు తీసింది. బండి దారిపక్కన వున్న ఒక చెట్టు బోదెకు తగిలి ఆగిపోయింది. బండిలో వున్న ముగ్గురూ కంగారుపడిపోతూ బండిలోంచి దిగారు.

"ఇంకా నయం, బండి బోల్తాకొట్టింది కాదు, అదృష్టవంతులం!" అన్నాడు గోవిందయ్య ఆయాస పడుతూ.

"ఇప్పుడేం చేయడం?" అన్నాడు శివయ్య దిక్కులు చూస్తూ.

"చేసేదేముంది! ముగ్గురం తలా కాస్త సామాను మోసుకువెళదాం," అన్నది సీతమ్మ.

క్రూరమృగాల, బందిపోట్ల భయంలో, వాళ్ళకు వీరయ్య సంగతే గుర్తు రాలేదు. ముగ్గురూ సామాన్లున్న పెట్టెలు తలకెత్తుకుని బయలుదేరారు.

కొంతదూరం వెళ్ళాక సీతమ్మకు, వీరయ్య సంగతి గుర్తుకొచ్చి, "వీరయ్యను అక్కడే వదిలేశాం. ఈ అడవి మధ్య ముసలివాడు ఏమైపోతాడో ఏమో, పాపం!" అన్నది.

"ఇవన్నీ ఇప్పుడాలోచించకు. పట్నం చేరాక వాడికోసం ఎవర్నయినా పంపుదాం. వీరయ్య మాటకేం—అంత ఖరీదైన బండీ, గుర్రం!" అంటూ విసుక్కున్నాడు గోవిందయ్య.

అతి ప్రయాసమీద వాళ్ళు, ఒక కోసెడు దూరం నడిచి, అడవి దాటి, ఎండలో

సెగలు కక్కుతున్న ఇసుక ప్రదేశాన్ని చేరారు. ఆసరికి ముగ్గురూ బాగా అలసి పోయారు. అందరికన్న బరువైన పెట్టెను మోస్తున్న గోవిందయ్య, ఇక కాలు సాగక, పెట్టెను దించి దానిమీద కూర్చుంటూ, "దాహం! నాలుక పిడచకట్టుకు పోతున్నది. మంచినీళ్ళ చెంబెక్కడ?" అని భార్యనడిగాడు.

సీతమ్మ దిగాలుపడిపోతూ, "అయ్యో, దాన్ని బండిలోనే మరిచిపోయాం!" అన్నది.

ఆ సమయంలో గోవిందయ్యకు, ఇంటి దగ్గిర మండుటెండలో పెద్దపెద్ద బరువులు మోస్తూ, తన నౌకర్లు ఎంత ప్రయాసకు గురయ్యేవాళ్ళో, అన్న ఆలోచన కలిగి, మనసు చివుక్కుమన్నది. ఆ క్షణంలోనే అడవిలో ఒంటరిగా వున్న ముసలి వీరయ్య గుర్తుకు వచ్చాడు.

గోవిందయ్య చప్పున పెట్టె మీది నుంచి లేచి, వెనుదిరిగి మెల్లగా అడవిలోకి బయలుదేరాడు. శివయ్య అతణ్ణి వారిస్తూ, "బండిలో వున్న మంచినీళ్ళచెంబు నేతెస్తాను. నువ్విక్కడే వుండు," అంటూ అక్కడి నుంచి కదిలాడు.

ఆ మాటకు గోవిందయ్య అడ్డంగా తలాడిస్తూ, "నేవెళుతున్నది మంచినీళ్ళ కోసంకాదు, గుండెనొప్పితో అడవిలో బండినుంచి కింద పడిపోయిన ముసలి వీరయ్య కోసం. పద, కట్లు తెంచుకుని పారిపోయిన గుర్రాన్ని మనమే వెతికి



పట్టుకుని, వాణ్ణి పట్నం తీసుకుపోయి వైద్యుడికి చూపిద్దాం," అన్నాడు.

అతడలా అనగానే, సీతమ్మా, శివయ్యా ముఖముఖాలు చూసుకున్నారు. అది గమనించిన గోవిందయ్య, "ఇంతకాలంగా నేను తోటి మనుషులపట్ల అమానుషంగా ప్రవర్తించాను. ఈ జరిగిన అనుభవం నాకొక మంచి గుణపాఠం. మోసేవాడికే తెలుస్తుంది కావిడి బరువు—అన్న పెద్దల మాటకు అర్థం ఇప్పుడు, నాకుతెలిసింది!" అన్నాడు.

అంతలో వాళ్ళకు గుర్రం సకిలింపూ, గిట్టల మోతా వినిపించింది. వీరయ్య బండితో వాళ్ళకేసే వస్తున్నాడు.

గోవిందయ్య గబగబా బండిని సమీపించి, "ఏరా, వీరయ్యా! అంత గుండె నొప్పితోనూ గుర్రాన్ని వెతికి పట్టుకుని బండికి కట్టి తోలుకువస్తున్నావా?" అని అడిగాడు జాలిపడుతూ.

"అయ్యా, ఈగుండెనొప్పి పదారేళ్ళుగా నాకు మామూలే! అయితే, ఇంతవరకూ నేను, ఆ బాధతో మీకంటపడలేదు! ఈ అడవిలో గుర్రం ఎక్కడికి పోతుంది, కొంతసేపటికి అదే బండి దగ్గరకు తిరిగొచ్చింది. నా కారణంగా మీరు బరువులు మోయవలసి వచ్చింది, క్షమించండి!" అన్నాడు వీరయ్య.

ఆ మాటలు విన్న గోవిందయ్య ముఖం ప్రసన్నమయింది. ఆయన వీరయ్య భుజం తట్టి, "ఒరే, ముందు ఆ మంచినీళ్ళ చెంబు ఇటివ్వు!" అని మంచినీళ్ళ చెంబు అందుకుని, గడగడా నీళ్ళుతాగి, "నేను క్షమించవలసినంత తప్పు, నువ్వేం చెయ్యలేదు. నేనే ఇంతకాలంగా, నా నౌకర్లందరి పట్లా తప్పు చేసాను. మోసేవాడి బరువు, చూసేవాడికి తెలియదు!" అన్నాడు.

ఆ తర్వాత ముగ్గురూ బండిలో పట్నం వెళ్ళి, మర్నాడు తిరిగి ఇల్లు చేరారు. ఆనాటి నుంచీ గోవిందయ్య, తన నౌకర్లను దయగా చూస్తూ, వాళ్ళచేత మా యజమాని దేవుడు, ధర్మరాజు అనిపించుకున్నాడు.



# హింస!

అడవిపక్కన వున్న ఒక చిన్న గ్రామంలో నివసించే, ఒక రైతు సాయంకాలంవరకూ తన పొలంలో పనిచేసి, ఇంటికి తిరిగివస్తున్నాడు. దారిపక్కన ఒకచోట అతడికి పెద్దగా పులి గాండ్రించిన శబ్దం వినిపించింది. అతడు తలతిప్పి చూశాడు. నాలుగైదడుగుల దూరంలో, రెండు చెట్ల బోదెలమధ్య ఇరుక్కుపోయిన పులి ఒకటి బైటపడేందుకు ప్రయత్నిస్తూ, చెవులు చిల్లులుపడేలా గాండ్రిస్తున్నది.

పులి ఏ క్షణంలో అయినా, బోదెలమధ్యనుంచి బయటపడి, తన మీదికి లంఘించవచ్చునన్న భయంతో, దాన్ని అలా బందీగా వున్నప్పుడే చంపడం క్షేమమనుకుని రైతు వేగంగా దాని దగ్గిరకుపోయి, చేతిలో వున్న పదునైన కొడవలిని కిందపెట్టి, రెండు చేతులతో దాని వెనకకాళ్ళు లాగి పట్టుకున్నాడు. అయితే, రైతుకు పులిని కాళ్ళు సరికిచంపేందుకు, కొడవలిని ఉపయోగించడం సాధ్యపడలేదు. పులి బలంగా కాళ్ళను అతడి పట్టునుంచి విడిపించుకునేందుకు, గింజుకోసాగింది.

ఏమి చేయడమా అని రైతు ఆలోచిస్తున్నంతలో, ఆ దారివెంట వస్తూ సన్యాసి ఒకడు కనిపించాడు. రైతు అతడితో, "అయ్యా, పరిస్థితి చూశారుగదా! నేను పులికాళ్ళను ఇలాగే బలంగా పట్టుకుని వుంటాను. మీరు కొడవలితో దాని తల నరకండి," అన్నాడు.

అందుకు సన్యాసి అడ్డంగా తలాడిస్తూ, "నేను హింసచేయను! మారణాయుధం ముట్టను!" అన్నాడు.

"అలా అయితే, స్వామీ! మీరు పులికాళ్ళు పట్టుకోండి. నేను కొడవలితో దాని అంతు చూస్తాను," అన్నాడు రైతు.

సన్యాసి పులికాళ్ళు పట్టుకున్నాడు. రైతు వెంటనే కొడవలి తీసుకుని అక్కడినుంచిబయులుదేరాడు. అది చూసి సన్యాసి నివ్వెరపోతూ, "వెళ్ళిపోతున్నావేం? పులిమాటేమిటి?" అన్నాడు.

దానికి రైతు, "స్వామీ, మీ మాటలు విన్నాక, నాకూ హింసపట్ల విరక్తి కలిగింది! ఇప్పుడు నేను పులిని చంపడమంటే, దాన్ని కదలకుండా పట్టుకున్న మీరూ, ఆ పాపంలో పాలు పంచుకోవలసి వస్తుంది. అది నాకిష్టం లేదు!" అంటూ తన గ్రామంకేసి బయలుదేరాడు.

—కవిలె సతీశ్‌కుమార్





# గురు శిష్యులు

యశోధరమహారాజు కిద్దరు కొడుకులు. పెద్దవాడు శ్రీధరుడు చురుకైనవాడు. రెండోవాడు జలంధరుడు మూర్ఖుడు. ఇద్దరినీ ఒకే గురువువద్ద చదివించాలని మహారాజు అభిలాష. అందుకని ఆయన దండకారణ్యంలోని సాందీపుడి వద్దకు వెళ్ళాడు.

సాందీపుడు, రాజు చెప్పింది విని, "నేను వృద్ధుడనైపోయాను. గురుకులాశ్రమం నడిపే ఓపిక నాకు లేదు. నా శిష్యులిద్దరు రాజధానిలో స్థిరపడి మంచి పేరు తెచ్చుకున్నారు. వాళ్ళల్లో ఎవరైనా నీ అభీష్టం తీర్చగలరు," అని చెప్పాడు.

యశోధరుడు ముందుగా బృహస్పతి అనే సాందీపుడి శిష్యుడి వద్దకు వెళ్ళాడు. ఆయన రాజు చెప్పింది విని, "మహారాజు బిడ్డలేకాదు, సాక్షాత్తూ ఆ దేవుడే దిగి వచ్చినా పరీక్షించకుండా ఎవరినీ, నాకు శిష్యులుగా చేసుకోను. నా శిష్యుడు చురుకైనవాడు, గ్రహణశక్తి కలిగిన మేధావి అయి వుండాలి," అన్నాడు.

ఈ మాటలకు కోపం వచ్చినా తమాయించుకుని యశోధరుడు, శిలాసంస్కారి అనే సాందీపుడి రెండో శిష్యుడి వద్దకు వెళ్ళాడు.

శిలాసంస్కారి రాజును సగౌరవంగా ఆదరించి, "గురువైనవాడు చాకచక్యంతో పశువును కూడా మనిషిని చేయాలి. ఏ పరీక్ష లేకుండానే నేను శిష్యులను తీసుకుంటాను. ఎలాంటి వారికైనా నేను విద్యాబోధన చేయగలను," అన్నాడు.

యశోధరుడు రాజధానికి తిరిగి వెళ్ళి, మంత్రిని పిలిచి తన అనుభవాలు వివరించి, "నా రాజధానిలో అహంకారులకు స్థానం లేదు. బృహస్పతిని తగు విధంగా శిక్షించి అవమానించేదాకా, నాకు

"వసుంధర"

మనశ్శాంతి వుండదు. అందుకు సరళమైన ఉపాయం చెప్పు," అని అడిగాడు.

మంత్రి వెంటనే, "విద్యాబోధనచేసే గురువుల పాండిత్యానికి పోటీ పెట్టండి. మూర్ఖుల్ని కూడా. విద్యావంతుల్ని చేయగలిగిన శిలా సంస్కారి ప్రావీణ్యత ముందు, బృహస్పతి ఆగలేక అవమానం చెందుతాడు," అని రాజుకు సలహా ఇచ్చాడు.

యశోధరుడలాగే చేశాడు. అన్ని రకాల పోటీల్లోనూ సాటిలేని మేటి పండితుడుగా, బృహస్పతి ఒక్కడే నిలిచాడు.

రాజు ఆశ్చర్యపడి, "అయ్యా! ఇంత పాండిత్యం కలిగివుండీ అహంకరించడం, నీకు తగునా ?" అన్నాడు.

బృహస్పతి రాజుకు ,వినయంగా నమస్కరించి, "అహంకరించడం పండిత లక్షణం కాదు. నేను కావాలనే మీ ముందు, నా అహంకారాన్ని ప్రదర్శించాను. అందువల్ల మీలో అహంకారం రేగి నన్ను పరీక్షకు పిలుస్తారని ఊహించాను. నేను గొప్పవాడినని చెప్పుకోవచ్చు. కానీ మీ పోటీ మాత్రమే నా పాండిత్యానికి తగిన గుర్తింపునిస్తుంది," అన్నాడు.

రాజు ఈ మాటలకు సంతోషించి, "నీకు అహంకారం లేదని తెలిసి, నాకెంతో సంతోషంగా వుంది. నా బిడ్డ లిద్దర్నీ ఏ పరీక్షా లేకుండా శిష్యులుగా చేసుకునేందుకు, నీకిప్పుడే అభ్యంతరం వుండదనుకుంటాను," అన్నాడు.



"ప్రభూ! పరీక్ష అవసరం కూడదను కుంటే, తమ బిడ్డలను శిలాసంస్కారి వద్ద చేర్పించండి." అన్నాడు బృహస్పతి.

యశోధరుడికి మళ్ళీ కోపం వచ్చింది. విద్యాబోధకులకు పెట్టిన పోటీలలో, శిలా సంస్కారి ఆఖరు వాడుగా వచ్చాడు. ఆయన ఆ విషయం బృహస్పతికి గుర్తు చేసి, "మహారాజు బిడ్డలకు మంచి పండితుడివద్ద చదివేయోగ్యత లేదనా, నీ అభిప్రాయం?" అని అడిగాడు.

బృహస్పతి నవ్వి, "ప్రభూ! గురువు సమర్థతకూ, పాండిత్యానికీ సంబంధం లేదు. నేను చదివినదానితో తృప్తిపడక, ఇంకా ఇంకా ఏమేమో తెలుసుకోవాలను కుంటున్నాను. అందుకే సమర్థులను శిష్యులుగా తీసుకుంటున్నాను. వాళ్ళు నేను చెప్పినదానితో తృప్తిపడరు. తెలివైన ప్రశ్నలు వేస్తారు. వాళ్ళ ప్రశ్నలకు జవాబు చెప్పాలంటే, నేను నా తెలివి పెంచుకోవాలి. అంతా కలిసి చర్చించడంలో కొత్త కొత్త విషయాలు తెలుస్తాయి. ఆ విధంగా నా బుద్ధి వికసించడమే కాక, పదునెక్కుతుంది. ఒక్కమాటలో చెప్పాలంటే—నా శిష్యులే నాకు గురువులు. అయితే, శిలాసంస్కారి అలా కాదు. ఆయన తన తెలివిని పెంచుకునేందుకు కాక, శిష్యుల తెలివి పెంచాలని విద్యాబోధన చేస్తున్నాడు. అందుకాయన ఎన్నో పద్ధతులు కనిపెడుతున్నాడు. ఆ విధంగా పాండిత్యంలో ఆయన ప్రతిభ తగ్గినమాట నిజం. కానీ గురువుగా ఆయన నాకంటే చాలా చాలా గొప్పవాడు." అని రాజుకు వివరించాడు.

తెలివైన శిష్యులవల్ల గురువుజ్ఞానం పెరుగుతుంది. తెలివిలేని శిష్యుడివల్ల గురువుజ్ఞానం పెరగదుకానీ, విద్యాబోధనకు గురువు కొత్త పద్ధతులు కనిపెట్టగలుగుతాడు!

ఈ విషయం తెలుసుకున్నాక యశోధరుడు, శ్రీధరుడిని బృహస్పతివద్దా, జలంధరుణ్ణి, శిలాసంస్కారివద్దా శిష్యులుగా చేర్పించి సత్ఫలితాలు పొందాడు.





# వీర హనుమాన్

నలుడు చెప్పిన విధంగా రాముడు ఆజ్ఞాపించగా, వానరులు గుంపులు గుంపులుగా అరణ్యంలోకి వెళ్ళి, రకరకాల చెట్లను పెల్లగించుకునివచ్చి సముద్రంలో వేయనారంభించారు. ఇంకా బలవంతులు ఏనుగులంతేసి రాళ్ళను తెచ్చి సముద్రంలో వేస్తూంటే, సముద్రపు నీరు ఆకాశమంత ఎత్తు ఎగిరింది. సముద్రమంతా కెలకబారింది.

ఈ విధంగా తయారవుతున్న సేతువు ఎగుడు దిగుడుకాకుండా కొందరు తాళ్ళు పట్టుకున్నారు; కొందరు కొలత బద్దలు ఉపయోగించారు. నలుడు తలపెట్టిన సేతువు పదియోజనాల వెడల్పూ, నూరు యోజనాల నిడివీ గలది. రోజుకు సుమారు ఇరవైయోజనాల చొప్పున, అయిదు రోజులలో సేతువు నిర్మాణం పూర్తి అయింది. నలుడి సామర్థ్యం వల్లనే ఆ పని విజయవంతంగా జరిగింది. వానరులు పరమానందంతో అటూ ఇటూ ఎగిరారు.

చక్కని రాజమార్గంలాగా తయారైన ఆ సేతువు మీద వానరసేనలు సముద్రాన్ని దాటి అవతలి ఒడ్డు చేరాయి. శత్రువులు వస్తే చంపటానికి విభీషణుడు గదతీసుకుని, తన నలుగురు అనుచరులతో సహా సేతువు అవతలి చివర నిలబడ్డాడు.

సేతువును దాటేటప్పుడు హనుమంతుడి మీద రాముడూ, అంగదుడి మీద లక్ష్మణుడూ ఎక్కి కూర్చున్నారు.

21. వానరసేనల లంకాప్రవేశం



రాముడు వెంటనే లంకానగరం కేసి వానరసేనను నడిపించ నిర్ణయించాడు. రాముడు ముందు నడవగా వానరులు సింహనాదాలు చేస్తూ లంకానగరానికి బయలుదేరారు. వానరుల ఉత్సాహం చూసి రాముడు సంతోషించాడు.

వానరసేన లంకానగరం బయట విడియగానే నగరంలో నుంచి భేరుల ధ్వనులూ, మృదంగాల ధ్వనులూ, రాక్షసుల అర్భాటాలూ వినవచ్చాయి. వానరులకు కోపం వచ్చి, అంతకంటె గట్టిగా సింహనాదాలు చేశారు. లంకలో ధ్వజాల మీద ఎత్తిన రకరకాల పతాకలను చూస్తూ, రాముడు సీతను తలచుకుని దుఃఖించాడు.

అతను లక్ష్మణుడితో, "త్రికూట పర్వతం మీద ఆకాశాన్ని అంటుతున్నట్టుగా విశ్వకర్మ నిర్మించిన ఆ లంకా నగరాన్ని చూడు," అన్నాడు.

తరవాత అతను వానరసేనను వ్యూహంగా ఎలా అమర్చాలో చెప్పాడు. అంగదుడు నీలుడితో సహా తన సేనను వ్యూహం మధ్య ఉంచాలి. ఋషభుడూ, అతని సేనా కుడిపార్శ్వంలో ఉంటారు. గంధమాదనుడు తన సేనతో సహా ఎడమ పార్శ్వంలో ఉంటాడు. రామ, లక్ష్మణులు వ్యూహం ముందు ఉంటారు. సుగ్రీవుడు

వాళ్ళు కాలినడకన సేతువును దాటటానికి సుగ్రీవుడు ఒప్పుకోలేదు. హనుమంతుడూ, అంగదుడూ కూడా ఆకాశగమనంతోనే రామ, లక్ష్మణులను చేరవేశారు. మరికొందరు వానరులు కూడా గాలిలో ఎగురుతూపోయారు. వానరులు అధిక సంఖ్యలో ఉండటం చేత రద్దీ ఎక్కువై, కొందరు సముద్రంలో పడి, పైకి వచ్చారు. సేతువు దాటేటప్పుడు వానరులు చేసిన కోలాహలంలో సముద్ర ఘోష కూడా వినిపించలేదు.

సముద్రం అవతలి ఒడ్డున ఫలసమృద్ధి గల అరణ్యాలూ, వానరసేన విడియటానికి తగిన ప్రదేశాలూ ఉన్నాయి. కాని

సేనల వెనకపక్క ఉంటాడు. మొత్తం వానరసేన గరుడ వ్యూహంలో అమర్చ బడింది. లంకను పిండి కొట్టాలని వానరులకు మహా ఆత్రంగా ఉన్నది.

రాముడు సుగ్రీవుడితో, "రావణుడి దూత అయిన శుకుణ్ణి ఇప్పుడు వదిలి పెట్టు," అన్నాడు.

వానరుల చేత నానాబాధలూ పడి, ప్రాణభయంతో కొట్టుకుంటున్న శుకుడు, తనను సుగ్రీవుడు విడిచిపెట్టగానే వేగంగా రావణుడి వద్దకు వెళ్ళాడు. రావణుడు శుకుణ్ణి చూసి నవ్వుతూ, "రెక్కలు తెగినట్టుగా కనబడుతున్నాయి. వానరులకు దొరికిపోలేదు కద?" అని అడిగాడు. శుకుడు రావణుడితో ఇలా అన్నాడు:

"నేను సముద్రం అవతలి గట్టుకు ఎగిరి వెళ్ళి, సుగ్రీవుడితో నువ్వు చెప్ప మన్నమాటలే పొల్లులేకుండా చెప్పాను. వానరులకు కోపం వచ్చి, ఎగిరి నన్ను పట్టుకుని, చిత్రహింసలు పెట్టారు. ఆ వానరులు మాట్లాడరు. మాట్లాడితే వినరు. వాళ్ళ నుంచి జవాబు సంపాదించటం ఎలా? వాళ్ళు ముక్కోపులూ, క్రూరులూనూ. సముద్రానికి సేతువు కట్టి, సముద్రం దాటి రాముడు లంకాద్వారాన్ని చేరాడు. ఎలుగుబంట్లూ, వానరులూ నేల ఈనినట్టుగా భూమినంతా ఆక్రమించి ఉన్నారు. వానరులకూ, రాక్షసులకూ యుద్ధం తప్పదు. వానరులు ఏ క్షణాన అయినా లంకాప్రాకారాలను ఎక్కవచ్చు.





ఇస్తే సీతను రాముడికి ఇయ్యి, లేదా యుద్ధం చెయ్యి.''

ఈ మాట వినగానే రావణుడికి కోపంతో కళ్ళు ఎర్రబడ్డాయి.

''లోకాలన్నీ నా మీదికి వచ్చినా నేను సీతను ఇవ్వను. చాలాకాలంగా యుద్ధం లేక నా భుజాలు తీటగా ఉన్నాయి. నా సంగతి తెలియక రాముడు నా మీదికి యుద్ధానికి వచ్చాడు. నా బాణాలదెబ్బ అతను ఎరగడు,'' అన్నాడు రావణుడు.

అతను తన మంత్రులైన శుక, సారణులతో, ''సముద్రానికి సేతువు కట్టటమనేది అపూర్వం. నేను నమ్మను! మీరు రహస్యంగా వెళ్ళి, నిజంగా సేతువు నిర్మాణం జరిగిందో లేదో, వానరసేన ఏపాటి ఉన్నదో, రాముడి అస్త్రశస్త్రాలు ఏవో తెలుసుకుని రండి,'' అన్నాడు.

వాళ్ళిద్దరూ వానరరూపాలు ధరించి, వానరసేనలో ప్రవేశించారు. అంతులేని వానరసేనను లెక్కించటం వారికి సాధ్యం కాలేదు. వానరసేన సమస్త ప్రదేశాలనూ ఆక్రమించటమే గాక, ఇంకా కొంత సేన సేతువును దాటి వస్తూనే ఉన్నది.

ఇంతలో విభీషణుడు వాళ్ళిద్దరిని పోల్చిపట్టుకుని, రాముడితో, ''వీళ్ళు శుక, సారణులు అనే రాక్షసులు. రావణుడి మంత్రులు. వానరరూపాలతో, మన రహస్యాలు తెలుసుకునేటందుకు లంక నుంచి వచ్చారు,'' అని చెప్పాడు.

అప్పుడు వాళ్ళిద్దరూ రాముడికి దణ్ణం పెట్టి, విభీషణుడు చెప్పినది నిజమేనని ఒప్పుకున్నారు. రాముడు నవ్వి, ''మా సైన్యమంతా చూడండి. మమ్మల్ని చక్కగా పరీక్షించండి. తరవాత లంకకు తిరిగి పొండి. మీరు చూడటం పూర్తి కాకపోతే విభీషణుడు మీకు సేన అంతా చూపుతాడు. మీరు నిరాయుధులు గనక మిమ్మల్ని చంపరాదు,'' అంటూ, వాళ్లను పోనివ్వమని విభీషణుడితో చెప్పాడు.

రాముడు వాళ్ళద్వారా రావణుడికి ఒక సందేశం కూడా పంపాడు. అదేమి

టంటే: 'రావణుడా, రేపు తెల్లవారుతూనే నా కోపాన్ని నీపై వజ్రాయుధం లాగా ప్రయోగించ బోతున్నాను.''

శుక, సారణులు రాముడికి జయం పలికి, రావణుడి వద్దకు వెళ్ళి, ''రాజా, వానరసేనలో ప్రవేశించిన మమ్మల్ని విభీషణుడు పోల్చిపట్టుకుని, రాముడికి అప్పగించాడు. రాముడు మమ్మల్ని దయ దలచి విడిచిపుచ్చాడు. ఆ మాటఅటుంచి, ఆ వానరసేనకు రామ, లక్ష్మణ, విభీషణ, సుగ్రీవులున్నారు. ఇంకేం కావాలి, రాముడి బాణాలు చూస్తే, అతనికి ఎవరి సహాయమూ అవసరం లేదనే అని పిస్తుంది. వానరసేన సముద్రం దాటి వచ్చింది. దాని మేర తెలియరావటం లేదు. వానరులు మంచి యుద్ధోత్సాహంలో ఉన్నారు. యుద్ధం మాని, సీతను రాముడికి ఇచ్చెయ్యి.'' అన్నారు.

రావణుడు సారణుడితో, ''సీతను ఇవ్వను. నువ్వు సౌమ్యుడివి, శూరుడివి కావు. వానరసేనను చూసి దడుచు కున్నావు. నన్ను యుద్ధంలో ఎవడు జయించగలడు?'' అన్నాడు.

అతనికి వానరసేనను చూడాలని పించింది. అతను తన మేడ పైభాగానికి ఎక్కి, లంకానగరం చుట్టూ గల పర్వతాలూ, అరణ్యాలూ వానరమయంగా ఉండటం గమనించాడు. అతను తన సమీపంలో ఉన్న సారణుడితో, ''ఈ సేనలో బలవంతులూ, శూరులూ,





యుద్ధంలో ప్రముఖంగా పోరాడగలవారూ ఎవరు? ముఖ్యసేనానాయకులెవరు? సుగ్రీవుడి సలహాదార్లు ఎవరు?'' అన్నాడు.

దానికి సారణుడు ఇలా చెప్పాడు:

''నీలుడు వానర సేనా నాయకుడు. అంగదుడు వానర రాజ్యానికి యువరాజు. అతను వాలి కొడుకూ, వాలి అంతటి వాడూనూ. హనుమంతుడు మనకు ముందు తెలిసినవాడే. సేతువు నిర్మించిన నలుడు మహాపరాక్రమశాలి. అతని వెంట ఉన్న వానరసేన జయించరానిది. ఆ తెల్లని వానరుడు శ్వేతుడు, యుద్ధంలో మహాభయంకరుడు. ఎరుపు, పసుపు వెంట్రుకలు తోకలో గలవాడు కుముదుడు. ఇతనికి దయాదాక్షిణ్యాలు లేవు. యుద్ధం కోసం తహతహలాడుతున్నాడు.''

ఈ విధంగా చెబుతూ సారణుడు రావణుడికి రంభుడూ, శరభుడూ, పనసుడూ అనే వానర వీరులను గురించీ, ఇతర వానర సేనాపతులను గురించీ చెప్పాడు. తరవాత అతను భల్లూక ప్రముఖులను గురించి కూడా చెప్పాడు. భల్లూకాలలో ప్రముఖుడు జాంబవంతుడు.

సారణుడు వదిలేసిన వివరాలను శుకుడు రావణుడికి చెప్పాడు. హనుమంతుడి సమీపంలో ఉన్న రామలక్ష్మణులను ఇతనే రావణుడికి చూపాడు. రావణుడు రాముడి సమీపంలో తన తమ్ముడైన విభీషణుణ్ణి కూడా చూశాడు. అతనికి ఒక్క క్షణంపాటు భయం కలిగి, వెంటనే కోపంగా మారింది. శుకసారణులు శత్రువుల శౌర్య పరాక్రమాలను గొప్పగా చెప్పినందుకు అతను వారిని మందలించి, ''మీవంటి మంత్రులను పెట్టుకున్న నేను ఎప్పుడో చచ్చి ఉండవలసింది. మీరు లోగడ చేసిన మేలు తలచి, మిమ్మల్ని చంపకుండా వదులుతున్నాను. వెళ్ళిపొండి,'' అన్నాడు. రావణుడికి జయం పలికి వాళ్ళు వెళ్ళిపోయారు.

తరవాత రావణుడు మహోదరుడితో చెప్పి, కొందరు వేగులవాళ్ళను పిలిపించి,

"రాముణ్ణి గురించి సమస్తమూ తెలుసుకు రండి," అన్నాడు.

ఆ చారులు మారు రూపాలు ధరించి, సువేలపర్వతం దగ్గిరలో ఉన్న రామ, లక్ష్మణ, విభీషణ, సుగ్రీవులున్న చోటికి వెళ్ళారు. రామ, లక్ష్మణులనూ, వానర సేననూ చూస్తూనే వారికి దడ పట్టుకున్నది. దానికితోడు విభీషణుడు వాళ్ళను కనిపెట్టి, పట్టుకున్నాడు. ఆ చారులలో శార్దూలుడనే వాడు చాలా దుష్టుడు. వానరులు వాణ్ణి చంపే లోపున రాముడు అడ్డుపడి, శార్దూలుడితో బాటు మిగిలిన చారులను కూడా విడిపించాడు. వాళ్ళు కొద్ది దెబ్బలతో తప్పించుకుని లంకకు తిరిగి వెళ్ళారు.

శార్దూలుణ్ణి చూసి రావణుడు ఏదో జరిగిందని గ్రహించాడు. వాడు రావణుడితో, "వానరులను గురించి తెలుసుకోవటం ఎంత మాత్రమూ సాధ్యం కాదు. నేను విభీషణుడి అనుచరులకు దొరికిపోయాను. తరవాత వానరులు నన్ను నానా హింసలూ పెట్టారు. రాముడు నన్ను వానరుల బారినుంచి రక్షించాడు. అదృష్టం బాగుండి, బతికి బయటపడ్డాను. రాముడు లంకను ముట్టడించటానికి సిద్ధంగా ఉన్నాడు. సీతను రాముడికి ఇవ్వటమో, యుద్ధానికి సిద్ధం కావటమో చెయ్యటం మంచిది," అన్నాడు.

రావణుడు సీతనివ్వనని మళ్ళీ చెప్పి, వానర ప్రముఖులను గురించి శార్దూలుడి ద్వారా కూడా తెలుసుకున్నాడు.

తరవాత అతను విద్యుజ్జిహ్వ డనే రాక్షసుణ్ణి వెంట బెట్టుకుని సీత ఉండే చోటికి బయలుదేరాడు. అతను విద్యుజ్జిహ్వుడితో, "నువ్వు నీ మాయచేత రాముడి తల ఒకటి కల్పించు. దానితో బాటు ఒక గొప్ప ధనుస్సూ, బాణాలూ తయారు చెయ్యి. వాటితో మనం సీతను మోసం చేద్దాం," అన్నాడు.

విద్యుజ్జిహ్వుడు సరేనన్నాడు. రావణుడు వాడికి తన ఆభరణం ఒకటి తీసి, బహుమానంగా ఇచ్చాడు.





# అర్హుడెవరు?

పూర్వం చైనాదేశంలోని ఒక గ్రామంలో, ఒక భూస్వామి వుండేవాడు. ఆయనకు ఒక్కగానొక్కతే కుమార్తె. ఆమె గొప్ప సౌందర్యవతే కాక, సమర్థులైన గురువుల ద్వారా అన్ని విద్యలలోనూ ప్రవీణురాలయింది. ఆ కారణం వల్ల, ఆమెను వివాహమాడేందుకు సంపన్న కుటుంబాలకు చెందిన ముగ్గురు యువకులు వచ్చారు.

భూస్వామి, ఆ ముగ్గురినీ అనేక విధాలుగా ప్రశ్నించీ, పరీక్షలు పెట్టీ, ముగ్గురూ అన్నిటిలో సమ ఉజ్జీలని గ్రహించాడు. ఆ పరిస్థితుల్లో, ఆయన బాగా ఆలోచించి వరుణ్ణి ఎన్నుకునే పని, తన కుమార్తెకే వదలడం మంచిదని నిర్ణయించుకుని, ఆ సంగతి ఆమెతో చెప్పాడు. భూస్వామి కుమార్తె, తండ్రి చెప్పినదానికి సరేనన్నది. కానీ, వారాలూ, నెలలూ గడుస్తున్నా, ఆమెకు వారిలో ఎవరిని వివాహమాడాలో అర్థం కాలేదు. ఇంతలో ఆమెకు హఠాత్తుగా జబ్బు చేసి, ఎందరు వైద్యులు చికిత్సచేసినా వ్యాధి నయం కాక చనిపోయింది.

ఆమె మరణం, ఆమెను వివాహం ఆడదలచిన ముగ్గురు యువకులకూ విపరీతమైన దుఃఖం కలిగించింది. వాళ్ళామె మృతదేహాన్ని ఒక అందమైన పూలతోట మధ్య చలవరాతి సమాధిలో భద్రపరిచారు. యువకుల్లో ఒకడు రాత్రింబవళ్ళు, ఆ సమాధి పక్కనే వుంటూ, సమాధిని రోజూ పూలతో అలంకరిస్తూ, తీరని దుఃఖంతో కాలం గడపసాగాడు. రెండవ యువకుడు కుమార్తె పోయిన విచారంలో భూస్వామికి సేవలు చేస్తూ, అతడి ఇంటనే వుండిపోయాడు.



ఇక మూడవ యువకుడికి ప్రపంచమంటేనే విరక్తికలిగింది. మహాత్ములైన వారిని దర్శించి జ్ఞానసముపార్జన చేయాలని నిర్ణయించుకుని సన్యాసిలా ఊళ్ళు పట్టుకుని తిరగసాగాడు.

ఒక రోజు ఈ సన్యాసియువకుడికి, తను చేరిన గ్రామంలో ఒక మహాపండితుడు ఉన్నాడని తెలిసింది. ఆ మహాపండితుడు సర్వశాస్త్ర పారంగతుడే కాక, రకరకాల అద్భుతశక్తులు కలవాడని కూడా విని, సన్యాసి ఆయనను దర్శించబోయాడు.

పండితుడు, సన్యాసియువకుణ్ణి ఆదరించి అతడి సంశయాలకు తృప్తికరమైన జవాబులిచ్చి, భోజన సమయంలో తనతోపాటు కూర్చోవలసిందిగా అహ్వానించాడు.

ఇద్దరూ భోజనం చేస్తుండగా, పండితుడి పదేళ్ళ కొడుకు అక్కడికి పరిగెత్తుకుంటూ వచ్చి, తండ్రిని అది కావాలి, ఇది కావాలి అని వేధించసాగాడు. పండితుడు కొడుకు వేధింపును కొద్దిసేపు భరించి, చివరకు, "ఛీ, మంకుపట్టు వెధవా!" అంటూ వాణ్ణి గట్టిగా పట్టుకుని, దాపులనే భగభగ మండుతున్న పెద్ద పొయ్యిలోకి తోసేశాడు.

ఇది చూసి సన్యాసి యువకుడు నివ్వెరపోయి, తను మహాపండితుడనుకుంటున్నవాడు, ఏమాత్రం దయాదాక్షిణ్యాలు లేని పరమరాక్షసుడని భావించి, "అయ్యా, నువ్వు మహాపండితుడివనీ, గొప్ప అద్భుతశక్తులు కలవాడివనీ నలుగురూ చెప్పగా విని, నిజమే ననుకున్నాను. కాని, ఇప్పుడు నువ్వు నా కళ్ళెదుట చేసిన క్రూరకార్యానికి, నిన్ను రాక్షసుడికన్న అధముడివని చెప్పవలసి వుంటుంది! నీ నిజస్వరూపం తెలిసిపోయింది!" అన్నాడు.

సన్యాసి యువకుడి మాటలకు పండితుడు చిన్నగా నవ్వి, "మనుషుల నిజస్వరూపం, వాళ్ళు కోపంలో వున్నప్పుడు

మాట్లాడే తీరునుబట్టీ, చేసే పనులనుబట్టీ గ్రహించవచ్చునేది నిజం! కాని, నా విషయంలో నీది పొరబాటు అభిప్రాయం. అజ్ఞానికి అతిస్వల్ప సంఘటనలు కూడా, ఎంతో విడ్డూరంగా, అమానుషంగా కనిపించడం సర్వసాధారణమైన విషయం," అన్నాడు.

పండితుడి జవాబు విని, సన్యాసి యువకుడు తీవ్రస్వరంతో, "కన్నబిడ్డను మంటల్లోకి తోసి చంపడం అతి స్వల్ప సంఘటనా? నువ్వు నరరూపరాక్షసుడివి!" అన్నాడు.

ఆ మాటలకు పండితుడేమీ ఆగ్రహించకుండా, పెద్దగా మంత్రం ఒకటి ఉచ్ఛరించి, గట్టిగా చిటిక వేశాడు. మరుక్షణం అతడి కొడుకు ఏమాత్రం చెక్కుచెదరకుండా మంటల్లోంచి బయటికి వచ్చి, నవ్వుతూ తండ్రిని ఆప్యాయంగా కావిలించుకున్నాడు.

సన్యాసి యువకుడు ఇది చూసి అబ్బురపడి, పండితుడి పాదాలు తాకి, "మహాత్మా! నన్ను క్షమించండి," అని, పండితుడు తన కొడుకుకు తిరిగి ప్రాణదానం చేయడానికి చదివిన మంత్రాన్ని, ఒకటికి రెండుసార్లు మనసులో మననం చేసుకుంటూ, భూస్వామి కూతురు సమాధి దగ్గిరకు వచ్చి మంత్రాన్ని చదివాడు.

ఆ మరుక్షణం భూస్వామి కూతురు, తను వ్యాధిగ్రస్తురాలు కాకముందు



ఎలాంటి అందచందాలతో వున్నదో, అలాంటి రూపంతో చిరునవ్వు నవ్వుతూ నిలబడింది.

కుమార్తె తిరిగి బతికినందుకు భూస్వామి పరమానందం చెంది, ఆమెకు జరిగినదంతా చెప్పి, "అమ్మా, భర్తను ఎన్నుకోవడంలో ఇక జాప్యం చేయకు. ఈ ముగ్గురు యువకుల్లో నువ్వు కోరిన అతడితో నీ వివాహం జరిపిస్తాను," అన్నాడు.

భూస్వామి కూతురు ఏదో అనబోయేంతలో మొదటి యువకుడు, "నేనే నీకు భర్తకాదగిన అర్హత వున్నవాణ్ణి! నీ సమాధి దగ్గిర ఎండనకా, వాననకా పగలూ, రాత్రులూ కాలం గడిపాను," అన్నాడు.

రెండవవాడు, "నువ్వు చనిపోయిన తర్వాత, నీ తండ్రికి అండగా వుంటూ, ఇంతకాలంగా అన్ని సేవలూ చేస్తున్నాను. నీకు భర్త కాదగిన అర్హుణ్ణి నేనే!" అన్నాడు.

మూడవవాడు, "నువ్వులేని ప్రపంచం మీద విరక్తి చెంది, సన్యాసిలా ఊళ్ళు పట్టుకు తిరుగుతూ, ఒక మహా పండితుడి ద్వారా, ఒక అద్భుతమైన మంత్రం తెలుసుకుని, నిన్ను తిరిగి బతికించాను. నిన్ను వివాహమాడే అర్హత నాదే!" అన్నాడు.

అంతా విని భూస్వామి కూతురు కొంతసేపు మౌనంగా ఆలోచించి, చిరునవ్వు నవ్వి, "నేను చనిపోయాక, నా తండ్రికి అన్నీ చేస్తూ గడిపినవాడు, ఆయనకు పుత్ర సమానుడవుతాడు; నన్ను బతికించే మంత్రం నేర్చినవాడు పరోపకారి కింద లెక్క; ఇక నా సమాధినే అంటిపెట్టుకుని, తీరని దుఃఖంతో రోజులు వెళ్ళబుచ్చినవాడు, నిజంగా నన్ను ప్రేమించినవాడవుతాడు. కనక అతణ్ణే నేను వివాహమాడతాను," అన్నది.

భూస్వామి కుమార్తె చెప్పిన విధంగా, మూడవ యువకుడికి ఆమెనిచ్చి ఘనంగా వివాహం చేశాడు.






# అహంకారి

చిదానందుడు మహాపండితుడు. పూర్వీకు లిచ్చిన అస్తిపాస్తులుండడంవల్ల, ఆయన నచ్చినవారిని శిష్యులుగా తీసుకుంటూ వీలైనంతలో దీనజనులకు సాయపడు తూండేవాడు.

తామసుడనేకవి ఒక కావ్యాన్ని రచించి, ఆ దేశపు రాజుకు వినిపించాడు. రాజు తామసుడితో, "నీలో ప్రతిభ వున్నట్లే తోస్తున్నది. కానీ నువ్వు సానబెట్టని రత్నానివి. ఈ నగరంలో చిదానందుడనే మహా పండితుడున్నాడు. ఈ కావ్యాన్ని ఆయనకు చూపించి సరిచేయించుకో. తర్వాత నాకు చూపించు," అన్నాడు.

తామసుడు, చిదానందుడి వద్దకు వెళ్ళి విషయం చెప్పాడు. చిదానందుడు కొంత సేపు ఆలోచించి అతడితో, "నీ కావ్యం నా దగ్గిర వదిలివెళ్ళు. నేను సరిచేసి నీకు పంపుతాను," అన్నాడు.

తర్వాత రెండు రోజులకే ఆయన కావ్యంలో మార్పులు చేసి, తన మనిషి ద్వారా తామసుడికి పంపాడు.

కావ్యంలో చిదానందుడు చేసిన మార్పులు తామసుడికి నచ్చలేదు. అతడు సరాసరి ఆయన ఇంటికి వెళ్ళి, "అవసరమైనచోట మార్పులు చేయడం మంచిదే! కానీ, మీరు చేసిన మార్పులు నా మూల భావాన్నే మార్చివేశాయి. నేను చెప్ప దల్చుకున్నది మారిపోతే, అది నా కావ్యం కాకుండా పోతుంది కదా!" అన్నాడు.

చిదానందుడు చిరునవ్వు నవ్వి, "నాయనా! నీలో ప్రతిభవుంది. అందువల్ల నీ కావ్యంలో మూలభావాలు ఒకటికి మించి వున్నాయి. కానీ నీకింకా వయసు చాలదు. అందువల్ల ఏ మూలభావానికి ప్రాధాన్యతనివ్వాలో తెలుసుకోలేకున్నావు. కావ్యంలో నువ్వు ముఖ్యమనుకునే

జొన్నలగడ్డ రామలక్ష్మి



మూలభావం అసంబద్ధంగా వుంది. అందుకే రాజు నీ కావ్యాన్ని నన్ను సరి చేయమన్నాడు. నేను ప్రాధాన్యతనిచ్చిన మూలభావం కూడా నీదే! ఆ కావ్యం ఇప్పటికీ నీదే! నీ కావ్యంలో మార్పు అవసరం అని నాకు తోచింది. నీ కావ్యానికి రాజాశ్రయం కావాలని నువ్వు కోరుకున్నావు. కాబట్టి నేను చేసిన మార్పుల నంగీకరించడం మంచిది,'' అన్నాడు.

తామసుడు వినయంగా, ''అయ్యా! వయసులో నేను చిన్నవాణ్ణి కాబట్టి, అనుభవం తక్కువని ఒప్పుకుంటాను. కానీ నా కావ్యంలో మూలభావం ప్రాధాన్యత తెలుసుకునేపాటి వయసు, అనుభవం నాకున్నాయనే నమ్మకం. కావ్యాన్ని మీకు తోచిన విధంగా మార్చడం సబబుగా వుందంటారా?'' అని అడిగాడు.

చిదానందుడు బదులివ్వలేదు. తామసుడు గర్వంగా, ''అయ్యా! నా ప్రశ్నకు సమాధానం మీవద్దలేదు. అందుకే మౌనం వహించారు. అవునా?'' అన్నాడు.

అందుకు చిదానందుడు, ''నాయనా! నీ మొదటి ప్రశ్నకు బదులిచ్చాను. అందులోనే నీ రెండో ప్రశ్నకూ బదులుంది. అది నువ్వు తెలుసుకుంటే మంచిది. తెలుసుకోకుంటే నేను చెప్పి కూడా ప్రయోజనముండదు. ఒకే ప్రశ్నను మార్చి మార్చి అడిగే తత్వం నీకుండవచ్చు. కానీ ఒకే సమాధానం పదేపదే చెప్పడం నాకు నచ్చదు,'' అన్నాడు.

తామసుడు వెంటనే, ''మీకు నా మీద కోపం వచ్చినట్లుంది. మీరు చేసిన మార్పు అద్భుతంగా వుందని నేనూ ఒప్పుకుంటాను. అయితే, నా మూలభావం మారిపోయిందనే నా బాధ. అదెలా తొలగించుకోవాలో తెలియడం లేదు,'' అన్నాడు.

''నీ కావ్యాన్నిప్పుడు రాజు మెచ్చితే అది నీ కావ్యమే అవుతుంది. మూలభావం నీదేనని నేనే అంటున్నాను. అయినా, నీ బాధ తొలగడం లేదంటే, ఒక ఉపాయం చెప్పగలను. నీలో వయసుకు,

ప్రతిభకు మించిన అహంకారముంది. జీవితంలో ఏమైనా సాధించాలంటే ఆత్మ విశ్వాసం అవసరం. అహంకారం ప్రతిబంధకం. నువ్వు జీవితంలో ఏమైనా సాధించాక అప్పుడు అహంకారం నీకు వన్నెతెచ్చినా తేగలదు. కానీ ప్రస్తుతానికి అహంకారాన్ని వదిలిపెట్టు. నీకిక ఏ బాధా వుండదు," అన్నాడు చిదానందుడు.

"అయ్యా! తమరు నా ఆత్మవిశ్వాసాన్నే అహంకారమని భ్రమపడుతున్నారేమో!" అన్నాడు తామసుడు.

"నీలో ఆత్మవిశ్వాసం లేదు. ఉంటే నువ్వు రాజు చెప్పినమాట విని కావ్యాన్ని తీసుకుని, నా వద్దకు రావడానికి బదులు మరొక రాజుకు నీ కావ్యాన్ని వినిపించి వుండేవాడివి," అన్నాడు చిదానందుడు.

"ఇకమీదట అలాగే చేస్తాను. అప్పుడు మీరు నన్ను మెచ్చుకుంటారా?" అని అడిగాడు తామసుడు.

"మెచ్చుకోను. అహంకారంతో నీ ప్రతిభను రాణించకుండా చేసుకుంటున్నావని జాలిపడతాను. ఆత్మవిశ్వాసమంటే నేను గొప్పవాడినని అనుకోవడం కాదు. ఏదో ఒక రోజున గొప్పవాడినవుతానని నమ్మడం," అన్నాడు చిదానందుడు.

తామసుడు మారుమాట్లాడకుండా, తన కావ్యాన్ని తీసుకుని వెళ్ళి రాజుకు వినిపించాడు. ఈసారి రాజు కావ్యాన్ని మెచ్చుకున్నాడు. అప్పుడు తామసుడు, రాజుకు తన కావ్యంలో చిదానందపండితుడు చేసిన మార్పులను గురించి చెప్పి, "ఆ మహాపండితుడు నా కావ్యానికి ఎన్నో మెరుగులు దిద్దాడు. ఆ కారణంగా తమరు కావ్యాన్ని మెచ్చుకోగలిగారు," అన్నాడు.

రాజు, తామసుడి వినయగుణానికి సంతోషించి, విలువైన కానుకలిచ్చి పంపాడు.

ఈ విధంగా అహంకారం విడిచిపెట్టాక, తామసుడి బుద్ధి మరింత పరిపక్వత చెంది, తనలోని లోపాలను సరిగ్గా అంచనా వేసుకోసాగాడు. ఆ కారణంగా అతడు త్వరలోనే రాజ్యమంతటా మహాకవి అన్న పేరు సంపాదించుకున్నాడు.





# వాయసరాజు

అనేకవేల సంవత్సరాల కిందట అవంతీ దేశాన్ని అనూపుడు అనే రాజు పాలిస్తూండే వాడు. అయన ఆస్థానంలో ఒక గొప్ప దైవజ్ఞుడు ఉండేవాడు.

ఆ దైవజ్ఞుడు రోజూ సూర్యోదయాదివేళ నదికి స్నానం చేసేటందుకు క్రమం తప్పకుండా వెళ్ళేవాడు. ఆయన ఒక నాడు స్నానం చేసి శుచిగా ఇంటికి తిరిగి వస్తున్నాడు. వచ్చే దారిలో ఒక మామిడి తోట వున్నది. దైవజ్ఞుడు ఆ మామిడిచెట్ల కింది నుంచి నడిచి వస్తూండగా, చెట్టు కొమ్మలపైన వున్న ఒక కాకి సరిగ్గా అతడి మీద పడేటట్టు రెట్టవేసింది.

ఆయన మండిపడ్డాడు. తనను ఈ విధంగా మైలపరచిన ఆ ఒక్క కాకినే కాక, మొత్తం వాయసజాతినే సర్వ నాశనం చేసి వేస్తానని గట్టి ప్రతిజ్ఞ పట్టాడు.

ప్రతిజ్ఞ నెరవేరేటందుకు పరిస్థితులు కలిసివచ్చినై. ఎలా అంటే—రాజుగారి కోట పక్కన ఒక పూరిగుడిసె వున్నది. ఆ గుడిసెలో ఒక ముసలివాడుండేవాడు. ఆ రోజున వాడు వరిధాన్యం ఎండలో పోసి కావిలి కూర్చున్నాడు. మిట్ట మధ్యాన్నంవేళ. ఎండ మండిపోతున్నది. కాపలా కూర్చున్న ముసలివాడు కునికి పాట్లు పడసాగాడు.

ఆ పక్కనే మేస్తున్న ఒక గాడిద. ముసలివాడు అలా ఆదమరిచి వున్నప్పు డల్లా ధాన్యం మీద పడి బొక్కుతూ వచ్చింది. రెండు మూడుసార్లు గాడిదను అదిలించి చూశాడు. కాని అది అక్కడి నుంచి పోలేదు.

ఇక ఇది పనికాదనుకొని ముసలివాడు గాడిదను పట్టుకున్నాడు. ఇంత నూనె పోసి ఒక తాటాకు తడిపాడు. గాడిద

తోకకు ఆ ఆకు కట్టి నిప్పు ముట్టించాడు. భగ్గుమని మంటలు లేవగానే గాడిద పరిగెత్తసాగింది. ఒళ్ళూపై తెలియని గాభరాలో అది రాజుగారి ఏనుగులశాలలో చొరబడింది. దానితో ఏనుగులశాల నిప్పంటుకొన్నది.

మంటలో చిక్కుకొన్న ఏనుగులు ఘీంకరిస్తూ అటూ ఇటూ పరుగెత్తసాగినై. ప్రజలు భయకంపితులయ్యారు. హాహాకారాలు చెలరేగినై. మావటివాళ్ళు శ్రమపడి ఎట్లా అయితేనేం వాటిని పట్టి గొలుసులతో గట్టిగా కట్టివేశారు.



ఇలా జరగటంతో రాజుగారికి చాలా కలవరం కలిగింది. గాయపడిన ఏనుగులకు గజవైద్యులు చేతనైన చికిత్సలన్నీ చేశారు. ఎక్కడెక్కడి నుంచో అనేకమైన ఔషధులు తెచ్చి, తైలాలు రాయించి, మర్దనాలు చేయించి చూశారు. గుణం ఇవ్వలేదు.

కొన్నాళ్ళ తరవాత రాజుగారు యాదాలాపంగా ఈ సంగతి దైవజ్ఞుడితో అన్నారు. ఇటువంటి అవకాశం ఎప్పుడు చిక్కుతుందా అని కనిపెట్టుకొనివున్న దైవజ్ఞుడు భలే సంతోషం పొందాడు.

"ప్రభూ! ఆ ఏనుగుల గాయాలు మానాలంటే, కాకికొవ్వు తెప్పించి రాయిస్తే సరిపోతుంది. ఘనవైద్యులమని కబుర్లు చెప్పే ఆ గజవైద్యులకు ఈ మాత్రం ఎందుకు తెలియలేదో నాకు ఆశ్చర్యంగా వుంది!'' అన్నాడు.

రాజుగారికి ఈ చికిత్సాపద్ధతి బాగున్నట్టే తోచింది, పైగా ఖర్చులేనిది. ఎక్కడ కనబడిన కాకిని అక్కడనే పట్టి చంపి, రాజనగరుకు తేవలసిందని రాజుగారు దండోరా వేయించారు. ఇంకేం, రాజ్యంలో ప్రతివాడు వేటగాడయి పోయాడు. వందల, వేల సంఖ్యలో కాకులను చంపి తేసాగారు.

రాజు సాగిస్తూ వున్న ఈ దురంతం అనాడు కాకులకు నాయకుడుగా వున్న వాయసరాజుకు చాలా విచారం కలిగిం

చింది. రాజును కలుసుకోవాలని అను కున్నాడు.

వాయసరాజు ఎగిరి వెళ్ళి రాజ ప్రాసాదం చేరుకొన్నాడు. ఆ సమయంలో కలకల్లాడుతూ నిండుదర్బారు జరుగుతూ వుంది. వాయసరాజు సూటిగా ఎగిరివెళ్ళి రాజుగారి సింహాసనం పక్కన వాలాడు. అది చూసిన సేవకులు 'ఇదేమిటి, కాకి వచ్చి వాలిందేమిటి?' అంటూ పట్టుకోవ టానికి ప్రయత్నించారు. కాని దాని నేమీ చేయవద్దని చెప్పి రాజు వాళ్ళను వారిం చాడు.

అప్పుడు వాయసరాజు మానవభాషలో రాజుతో ఇలా అన్నాడు :

''రాజా, తమరు కోపగించక నా పలు కులు ఆలకించాలి. రాజైనవాడు ఇతరుల సలహాలను ఆచరణలో పెట్టేముందు మంచి చెడ్డలు ఆలోచించి చూడాలి. అలా చేయకపోతే ఎంతోమందికి దుఃఖ కారణం అవుతుంది. మీ దైవజ్ఞుడు, కాకి కొవ్వు ఏనుగుల గాయాలను మాన్పగలదని చెప్పాడు. నిజానికి, కాకి శరీరంలో కొవ్వు ఉండనే వుండదు. ఇది దుష్టబుద్ధితో ఇచ్చిన సలహా కాని, మరొకటి కాదు!''

ఈ మాటలు విని రాజు అనూపుడు అమిత ఆశ్చర్యపోయాడు. ''కాకి శరీ రంలో కొవ్వు ఉండకపోవటానికి కారణం ఏమిటి?'' అని వాయసరాజును ప్రశ్నిం చాడు.

అందుకు వాయసరాజు, ''మానవ లోకమే దానికి శత్రువు. కాగా, మరణ భయంతో ఎల్లప్పుడూ మగ్గిపోయే కాకికి కొవ్వు ఎలా పట్టుతుంది ప్రభూ?'' అని ఎదురుప్రశ్న వేశాడు.

దీనితో రాజుకు సత్యం తెలిసిపోయింది. కాకులను చంపరాదని శాసించాడు. దుష్ట బుద్ధితో తనచేత పాపకార్యం చేయించిన దైవజ్ఞుణ్ణి ఆ పదవి నుంచి తొలగించి వేశాడు. ఆనాటి నుంచీ రోజుకు రెండు పుట్ల ధాన్యం కాకులకు ఆహారంగా చల్ల వలసిందని ధాన్యాగారాధిపతికి ఉత్తరవు జారీ చేశాడు.



# ప్రకృతి వింతలు:

## కంగారూ తోక!

ఆస్ట్రేలియాకు చెందిన కంగారూ మామూలుగా నడవదు, పరిగెత్తదు. ఒక చోటి నుంచి మరొక చోటికి గెంతుతూ వెళుతుంది. పెద్ద జంతువు ఒక్కగెంతుకు 30 అడుగుల దూరం దాటగలదు. కంగారూ అలా గెంతేప్పుడు, దాని పొడవాటి తోక, నేల మీద ఆనుకుని, తగిన ఊపును సమకూరుస్తుంది. తోక పైకి లేచినట్టయితే, అది అలా గెంతజాలదు.





## ఏనుగుల సంకేతం!

ఏనుగులు మామూలుగా గుంపులు గుంపులుగా ప్రయాణం చేస్తాయి. గుంపుకు ముందు ఒక ఏనుగు కాపలాగా వెళుతుంది. ఏదైనా అపాయం అని తెలియగానే కాపలా ఏనుగు తొండాన్నెత్తి హెచ్చరిస్తుంది. మిగతా ఏనుగులు అరమైలు అవతల వున్నప్పటికీ- ఆ సంకేతాన్ని గ్రహిస్తాయి. కాపలా ఏనుగు సంకేతాన్ని మిగతా ఏనుగులు ఎలా తెలుసుకుంటాయన్న విషయం మనిషికి ఇంకా అంతుబట్టడం లేదు.

## ముళ్ళపంది

ఎలుకజాతికి చెందిన ముళ్ళపందుల బూడిద రంగు శరీరం నిండా దృఢమైన ముళ్ళ వంటి నలుపు తెలుపు ఈకలు వుంటాయి. ఒక్కొక్క జంతువు ఒంటి మీద దాదాపు 30,000 ఈకలు వుంటాయి. అవి డొల్లగా వుండడంవల్ల, వాటిలో సిరా నింపి వాటిని రాయడానికి కలం లాగా ఉపయోగించేవారు. ఈకలు డొల్లగా వుండడంవల్ల ముళ్ళపందులు నీళ్ళలో సులభంగా ఈదడానికి అవి బల్లకట్టులా ఉపయోగపడతాయి.



# ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1992 ఏప్రిల్ నెల సంచికలో ప్రకటింపబడును.



M. Natarajan



M. Natarajan

★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ ఫిబ్రవరి నెల 15 వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/–లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: – చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

## డిసెంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: కృషితో నాస్తి దుర్భిక్షం!

రెండవ ఫోటో: చరిత్రపుటల సాక్ష్యం!

పంపినవారు: జి. రాఘవేంద్రరావు, స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా, వరంగల్-506 002 (ఆం. ప్ర)

బహుమతి మొత్తం రు. 50/– నెలాఖరులోగా పంపబడుతుంది.


## చందమామ

ఇండియాలో సంవత్సర చందా: రూ. 48-00

చందా పంపవలసిన చిరునామా:

డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600 026

Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.


---

CHANDAMAMA (Telugu) February 1992 Regd. No. M. 4854

పాలు కొబ్బెరల
అపూర్వ సమ్మేళనం
పిల్లల మనసులుదోచే
వింతైన అనుభవం







nutrine
COOKIES



కోకోనక, 'న్యూట్రిన్ కుక్కీస్' తో
ఆనంద కోలాహలం !






Visesh/NC/9090/Tel